# భగవత్ప్రార్థనయే మతమున కంతకును సారభూతమైనది

## సబర్మతీ ఆశ్రమమునందు గాంధిమహాత్ముని ఉపన్యాసము

గూర్జరమునందలి విద్యాలయాల వసతిగృహముల (హాస్టల్సు)లో నివసించుచున్న విద్యార్థులసభ అహమదాబాదులో జరిగినది. రాష్ట్రమునందన్ని ప్రదేశముల నుండియు విద్యార్థులు, ఉపాధ్యాయులు, పౌరులు మున్నగువారు చాలమంది వచ్చిరి. సభ ముగిసిన పిమ్మట వారు మహాత్ముని సందర్శించి భగవత్ప్రార్థనయొక్క ఆవశ్యకతను గూర్చి యుపన్యసింపవలెనని కోరిరి. అందువలన ఆనాడు సాయంకాలము ప్రార్థన ముగియగనే మహాత్ముడావిషయమును గూర్చి గుజరాతీభాషలో నుపన్యసించెను.

"అట్టి ముఖ్యమైన యొక విషయమును గూర్చి మాటలాడ మీరు కోరినందులకు నేను చాల సంతసించుచున్నాను. మతమున కంతకును సారభూతమైనది ప్రార్థనయే. కావున మనుష్యుని జీవితమునకు భగవత్ప్రార్థనమే మూలాధారముగా నుండవలెను. ఏలననగా మతము లేకుండ నే మనుష్యుడును గూడ జీవింపజాలడు. కొందరు అహంభావముచేత "మతముతో మాకేమియును సంబంధము లేదు" అని అనుచుందురు. "నేను గాలిని పీల్చుదును గాని నాకు ముక్కు లేదు" అని చెప్పువాడెట్టివాడో "నాకు మతముతో నెట్టి సంబంధమును లేదు" అను వాడును అట్టివాడే. విజ్ఞానము, సహజప్రబోధము, విశ్వాసము మున్నగు వానిలో నేదో యొకదాని వలన మనుష్యుడేదో యొక విధమున భగవంతునితో సంబంధమును కలిగియే యుండును. కేవలము నాస్తికులనబడువారు గూడ నైతిక నియమముల ననుసరింపవలెననియే తెలిపెదరు. వాని ననుసరించుటవలన లాభమును పరిత్యజించుటవలన నష్టమును కలుగునని గూడ వారంగీకరింతురు. బ్రాడ్లా నాస్తికుడని విఖ్యాతిగాంచినను సత్యమే అతడు తన నిశ్చితాభిప్రాయమును మనకు తెలుపుచుండెను. అటుల సిద్ధాంతమును సత్యముగనే తెలుపుచుండుటవలన నతడు చాల కష్టములకు గురికావలసివచ్చినది గాని వాని నన్నిటిని సంతోషముతోనే భరించుచుండెను. "సత్యమే నాకు లభించిన బహుమానము" అని అతడనుచుండెడివాడు. సత్యమును పలుకుటవలన కలిగెడు నానందము నతడనుభవింపజాలనివాడు కాడు. ఆశక్తి అతనికి లేకపోలేదు. కాని ఆయానందము శాశ్వతానందము కాదు. భగవంతుని కృపవలననే ఆయానందము కలుగును. కావున భగవంతుడు లేడనువాడు గూడ మతసంబంధము లేకుండ జీవింపడు, జీవింపజాలడు.

భగవత్ప్రార్థనయందు సహజముగనే యొక మహాశక్తి కలదు. అది విజ్ఞప్తిరూపమును అంతరంగికమును భగవానుని సంధానమును గూడనై యున్నది. విజ్ఞప్తిరూపమైనచో తన ఆత్మను పునీతము గావింపవలెననియు, దానిని క్రమ్ముకొనియున్న మోహము అజ్ఞానము మున్నగు వికారములను తొలగింపవలెననియు మాత్రమే మనము భగవంతుని ప్రార్థింపవలెను. తన హృదయములనందు నెలకొనియున్న పరమాత్మ అనుగ్రహమును బడయగోరు జీవునకు ప్రార్థనయొక్కటియే శరణ్యము. ఇది కేవలము మాటలను వల్లెవేయుటయును, మంత్రములను చదువుటయును, శ్లోకములను వినుటయును మాత్రమే కాదు. అనుక్రమముగ వాక్యమునో ఉచ్చరించుటవలన అనిర్వాచ్యమగు మానసానందానుభవము కలుగకున్నచో అనేకులు రామనామమును స్మరించుచున్నను గూడ నెట్టిలాభమును కలుగదు. ప్రార్థనకు ప్రధానము మనసుగాని మాటలుగావు. మనోవాక్కులతో గూడిన ప్రార్థనయును మాటలతో పనిలేని మానసిక ప్రార్థనయునుగూడ లాభకరములే యగును గాని కేవల మనఃపూర్వకము గాకుండ వట్టి మాటలతో చేయబడెడు ప్రార్థనవలనమాత్ర మెట్టిలాభమును కలుగదు. అపుడు భగవదనుగ్రహమునకు పరితపించుటవలననే ప్రార్థన జనింపవలెను. ఆకలిగొనినవాని కాహారము చాల రుచికరముగా నుండునట్లు పరితాపముగలవానికి మనఃపూర్వకమగు ప్రార్థన మహదానందకరముగా నుండును. ప్రార్థనయందు గల మహామహిమను పరిగ్రహింపగలిగినవాడు కొన్నిరోజులపాటు తిండిలేకుండనైన నుండగలడు గాని ప్రార్థన లేకుండ నొక్క క్షణికమైన నుండలేడు. ప్రార్థనలేనిచో మనశ్శాంతి కలుగదు. ఇది నాకును నామిత్రులకును స్వానుభవముతో గూడిన విషయమే.

"అటులైనచో మీరు అనుక్షణమును ప్రార్థనచేయుచునే యుండవలెనా?" అని మీరడుగవచ్చును. అది నిశ్చయమే గాని మనము పాపులమును, పాపకర్ములమును, పాపాత్ములమును, పాపసంభవులమును నగుటచే ఒక్కక్షణికమైన మానసికముగ భగవంతునితో అనుసంధానమును కలిగియుండుట మనకు దుర్లభముగనే యుండును. అట్టిచో నిరంతరమును తదేకధ్యాన నిమగ్నులమగుట కేవల మసంభవమే. అందువలననే ప్రతిదినమును కొంత కాలమును భగవత్ప్రార్థనకొరకు ప్రత్యేకించుచుందుము. ఆ క్షణకాలమైనను లౌకికవిషయ విచారమును పూర్తిగా విడనాడి యుండుటకు అనగా రక్తమాంస మిశ్రితమగు శరీరమునందు బంధింపబడియుండియును బంధవిముక్తులమై యుండుటకు సర్వశక్తులను వినియోగించుచుందుము. సూరదాసు రచించిన కీర్తనను మీరు వినియే యుందురు. భగవదనుగ్రహముకొరకు పరితపించుచున్న జీవుని హృదయవేదన యదియే. మన దృష్టిలో సూరదాసు మహనీయుడే గాని "నేను పరమపాతకిని" అనియే అతడు మొరలిడుచున్నాడు. భక్తిసంపదలో నతడు శ్రేష్ఠుడనియు, మనము విఘ్నులమనియు మనము భావించుచున్నాముగాని భగవంతుని దర్శనము తనకు లభింపలేదను గురుతర సంతాప మతనిని దహించివేయుచుండుటవలననే పరమదయాకరుడగు పరమేశ్వరు నుద్దేశించి అతడటుల మొరపెట్టియున్నాడు.

ప్రార్థనయొక్క ఆవశ్యకతను దాని మహిమను నేనిపుడు మీకు తెలిపియున్నాను. మనము మన సోదరమానవులను సేవచేయుటకే సృష్టింపబడితిమి గావున మనము తగిన జ్ఞానసంపదను బడసియుండిననే గాని మనవిధిని నెరవేర్చజాలము. మనుష్యుని హృదయమునందు భోగపరత్వమునకును త్యాగపరత్వమునకును నిరంతరము దారుణమగు పోరు జరుగుచునే యుండును. అట్టి ప్రార్థనయను రక్షణముగలవాడు భోగేచ్ఛలను కలిగెడు పాపప్రేరణలను జయింపగలుగును. లేనిచో వానికి కడు సులభముగనే లొంగిపోవును. ప్రార్థనపై నాధారపడువానికి తన మనసులోను ప్రపంచములోను గూడ శాంతి కలుగును. అట్టి ప్రార్థన గూడ లేక లోకవ్యాప్తమున మునిగియుండువాడు తాను దుఃఖభాజనుడగుటయేగాక లోకమునుగూడ దుఃఖభాజనముగ నేచేయును. కావున మరణానంతరము పునరావృత్తిరహితమగు శాశ్వతపదవిని పడయుటకు మాత్రమే గాక యీ ప్రపంచమున జీవించియున్నంతవరకు సుఖశాంతులను గలిగియుండుటకు గూడ ప్రార్థన ముఖ్యాధారముగనున్నది. మన నిత్యకృత్యములు సరిగా జరుగుటకును శాంతియును పరిణతియును లభించుటకును ప్రార్థనయే మూలాధారము. ఈ యాశ్రమమునందున్న మేమందరము సత్యాన్వేషణార్థమే యిచట నున్నాము. సత్యమునందే దీక్షబూనియున్నాము. గాన ప్రార్థనయొక్క మహిమయందు మాకు నమ్మకము కలదని తెలుపుచున్నాము. గాని మేమిప్పటికినిగూడ దానినే ప్రధానప్రయోజనముగా నొనరించుకొనగలిగియుండలేదు. ఇతరవిషయములందు మేము చూపుచున్నంత శ్రద్ధను ప్రార్థనయందు మేమింకను చూపగలిగియుండలేదు. ఈ విషయమున నేను చాల అశ్రద్ధచేయుచున్నాను. ఈ విషయ మొకనాడు ఉదయమున నేను నిద్రలేవగానే తటాలున నా మనసునకు తట్టినది. అందువలన ప్రార్థనవిషయమున నేను కొన్ని కఠినియమముల నేర్పరచితిని. ఆ నియమముల ననుసరించుటవలన మాకు మేలే కలిగినది గాని లేశమైనను కష్టము కలుగలేదు. మన జీవితముల ముఖ్యతమమగు నీ భగవత్ప్రార్థనవిషయమున మనము అప్రమత్తులముగా నున్నచో తక్కినవన్నియు అప్రయత్నముగానే నెరవేరగలవు. ఒక చతురమునందొక కోణమును సరిచేసినచో తక్కిన కోణములన్నియును అవలీలగ నే చక్కనగును.

### బ్రాహ్మముహూర్తమునందేల ప్రార్థనచేయవలెను

కావున ప్రతిదినము ప్రశాంతమగు బ్రాహ్మముహూర్తమునందే మేల్కొంచి కాల్యకృత్యములను తీర్చుకొని ప్రప్రథమమున భగవత్ప్రార్థనముచే నలుపుటకు మీరు దీక్షబూనుడు. అపుడు మీరు మనఃపూర్వకముగ నేకాగ్రతతో ప్రార్థనమొనరించునెడల సాయంకాలమువరకు అది మిమ్ము కాపాడుచుండగలదు. మరల రాత్రి పరుండబోవునపుడు మీరు భగవంతుని ప్రార్థించి పరుండినచో రాత్రి మీరు సుఖనిద్ర ననుభవింపగలుగుదురు. పీడకలలు మున్నగునవి మిమ్ము బాధింపవు. ప్రార్థన యేదో యొకరీతిగనే యుండవలెనను నియమ మెప్పటను లేదు. అది యేరీతిగా నుండినను సరే ఏ భాషలోనుండినను సరే మనలను భగవంతుని ఆంతికమున నిలుపుటయే ప్రార్థనయొక్క ముఖ్యప్రయోజనము. మనము నోటితో ప్రార్థన మొనరించుచున్నపుడు మనసు మరియొకచోటికి పోకుండ ఆ వాక్యములందే లగ్నమైయుండుట అత్యవసరము. కాన యీ విషయమునందే మనము మిక్కిలి శ్రద్ధబూనవలసి యున్నది.

నేను తెలిపిన యీ విషయములు మీ మనసులలో నాటుకొనియున్నచో మీ వసతిగృహములలో భగవత్ప్రార్థనము నిర్బంధముగా నొనరించునట్లు ఆగృహముల పరిశీలకులను నిర్బంధించువరకును మీకు మనశ్శాంతి కలుగదు. మన విషయమున మనము విధించుకొనిన నియమములు రవంతమాత్రమును నిర్బంధము కాజాలవు. ఈరీతిగా నియమాచరణము వలన యింద్రియనిగ్రహము నలవరచుకొనకుండ స్వేచ్ఛాచరణమునకు గడంగెడువాడు యింద్రియములకు దాసుడగును. ఈ నియమముల ననుసరించువాడు జితేంద్రియుడగును. ప్రపంచమున సూర్యచంద్రాది గ్రహములును సమస్త జీవరాసులును గూడ నియమములకు బద్ధములుగనే యున్నవి. అట్టి నియమబంధము లేకున్నచో ఒక్క క్షణమైనను ప్రపంచవ్యాపారము సక్రమముగ జరుగజాలదు. తోడిమానవులకు సేవచేయుటయే మీకు పరమధర్మమై యుండుటచే నిర్బంధ నియమాచరణము లేకున్నచో మీరు భ్రష్టులయ్యెదరు. అట్టినియమము లన్నిటిలోను భగవత్ప్రార్థనము శ్రేష్ఠతమము. ఈ నియమనిగ్రహములు లేకున్నచో మనుష్యులుగూడ పశుతుల్యులేయగుదురు. పశువులవలె మనముగూడ నాలుగుకాళ్లతోను నడువకుండ తలను పైకెత్తియే నడువగోరినచో విధిగా మనము నియమనిగ్రహములకు బద్ధులము కావలసియే యుండును' అని మహాత్ముడు నుడివెను.

(యంగు యిండియా 23 1-30)

# జాబులు

## ఉచితము

నాకు గ్రంథాలయము లనిన యమితాభిమానము మన యాంధ్రదేశ గ్రంథాలయములకు ప్రచారార్థమై క్రింది గ్రంథములు ఉచితముగ నీయుదలచితిని కాన వెంటనే గ్రంథాలయాధిపతులు ఖర్చులకుగాను రూ 1 మాత్రము పంపిన "వైదికసభ్యత, అరిందమవిజయము, ఉర్వీసుతోద్వాహము, యోగచికిత్స, భారతీయప్రబోధము, ఖలదర్పిని" అను 400 పేజీలను 3-8-0 ఖరీదును గల గ్రంథములను ఉచితముగ నిచ్చెదను గ్రంథములు రిజిష్టరు చేసి జాగ్రత్తగా పంపబడును కొందరు తిరుగగొట్టుచుండిరి గాన వట్ పైడ్ పద్ధతిని మానితిమి గ్రంథాలయములకును పఠనమందిరములకును మాత్రమే పంపబడును గాన అన్యులు మాకు ప్రయాసకలిగించకుందురు గాక

వలయువారు ఈ క్రిందిచిరునామాకు వ్రాయుదు గద్దె లింగయ్యచౌదరి, యలమర్రు కృష్ణాజిల్లా

---

## రాజమహేంద్రవరములో బహిరంగసభలు

డాక్టర్ ఇ స్టాన్లీజోన్సుగారు ది 4-2-30 సోమవారమునుండి ది 7-2-30 శుక్రవారమువరకు ప్రతిదినము సాయంకాలము 5½ గంటలనుండి కంభమువారిసత్రము హాలులో జెన్నింగ్స్ మిషన్ రీడింగురూములో ఉపన్యాసముల నిత్తురు. కావున, స్త్రీ పురుషు లెల్లరు విచ్చేయ ప్రార్థితులు

మరా —డాక్టరు జోన్సుగారు అమెరికా, యిరోపా, ఆసియా మొదలగు ఖండము లన్నియు సంచారము చేసిన సుప్రసిద్ధ వక్తలు ఇదివరలో రాజమహేంద్రవర పౌరులుకూడ వారి మహోపన్యాసములను వినియేయున్నారు ఉపన్యాసానంతరము సభ్యుల ప్రశ్నలకు సమాధానములనుకూడ నిత్తురు.

పి. జి ప్రకాశము,
కార్యదర్శి, మిషన్ రీడింగురూమ్.

---

## గుంటూరుమండల చర్ఖాసంఘము-తెనాలి

---

26-1-30 తేదీన సంపూర్ణస్వాతంత్ర్యదిన మహోత్సవ సందర్భమున గుంటూరుమండల చర్ఖాసంఘమువారు గావించిన ఖద్దరువిక్రయము వివరములు.

తెనాలిగ్రామము క్రొత్తపేట రు 125-8-9, అయితానగరంపాడు రు 69-1-3, కూచిపూడి రు84-13-6, ఖర్చులమొత్తం రు 0-11-8

బ్రహ్మాండం నరసింహం,
అధ్యక్షుడు.

## శ్రీ ఆంధ్రజాతీయకళాశాల - బందరు

ఈ మాఘశుద్ధ ౫ సోమవారం అనగా (3-2-30) కళాశాల సంస్థాపకాచార్యుల అష్టమ వార్షిక (నిర్యాణస్మృతి) దినమహోత్సవము జరుప పెద్దలవలన నిశ్చయింపబడినది. గాన తమరు బంధుమిత్రసహితముగ దయచేయ ప్రార్థితులు

ఇట్లు విధేయులు
పత్తి రామకృష్ణరావు,
గంగిరెడ్ల నరశింహస్వాము
అగ్నిహోత్రం విజయసారథి ఆచార్యులు
వడ్లమూడి రామమూర్తి
పోరంకి శాస్త్రిరాజు

ఆంధ్రజాతీయకళాశాల, బందరు, 29/1/30

కార్యక్రమము ది 3-2-1930 సోమవారము

ఉదయము గం॥ 7-30 మొదలు సంస్థాపకాచార్యుల సమాధియొద్దకు భజనతో కళాశాలనుండి వెడలుట, భజనకాలక్షేపము, శ్రీహనుమంతరాయ స్మృతి

గం॥ 10 కు బీదలకు బియ్యమును పంచిపెట్టుట

సాయంకాలము 4½ గం॥ కు నగరసంకీర్తనము

మరా —కళాశాల పూర్వ ప్రస్తుత విద్యార్థిసమావేశము తేదీ కార్యక్రమము ముందు తెలుపబడును.

# సంపూర్ణస్వాతంత్ర్య దినోత్సవము

## ఆంధ్రదేశము

### ఆనందనికేతనం

ఈనెల 26 వ తేదీని చాగల్లు రైలు స్టేషను సమీపగ్రామములలో పక్షమున ఆనందనికేతన ఆశ్రమమున స్వాతంత్ర్యోత్సవము అతి ఉత్సాహముతోను, జయప్రదముగను, జరుపబడినది. గత సాయంత్రమునకే కొవ్వూరునుండి కొందరు విద్యార్థులును, ఇల్లింద్రపర్రునుండి వింధ్యాల సత్యనారాయణగారును, అప్పారావుపేటనుండి మదునూరి దొరయ్యగారును ఆశ్రమమునకు చేరిరి. తెల్లవారుజామునకు పాడపిల్లినుండి వెలియ్యం సూర్యనారాయణగారును, చంద్రవరంనుండి పొన్నాడ వెంకట్రాజుగార్లును వచ్చిరి. ఉదయం నాలుగుగంటలకే ఆశ్రమవాసులును, తల్లాప్రగడ ప్రకాశరాయుడు, బ్రహ్మశ్రీ కోదండ రామయ్యగారు మొదలగు పెద్దలును, యితరమిత్రులును 20 మంది బయలుదేరి ఆశ్రమమునకు మూడుమైళ్లు దూరమందున్న చాగల్లు, నెల్లటూరు గ్రామములకును, కుంకుడుమిల్లి గ్రామమునకును జాతీయ గీతములను పాడుచు జండాలను తీసికొని తిరిగి 7½ గంటలకు ఆశ్రమమునకు చేరిరి. చాగల్లువారికి ఒకజండానిచ్చి అక్కడ కూడ ఉత్సవము జరుపుటకు ప్రోత్సహించిరి.

సరిగా 8 గంటలకు జాతీయ పతాకమును ఆశ్రమమందు నిలిపి పతాకమును గౌరవించిరి. దురదృష్టవశమున నాడు ఆశ్రమమునందు చాలినన్ని బియ్యము లేకపోగా ఉన్న బియ్యముచే గంజిక్రింద చేసికొని త్రాగి, సరిగా 9 గంటలకు బయలుదేరి గౌరిపల్లి, మల్లవరం, చంద్రవరం, మార్కొండపాడు, మద్దూరు, పాడపిల్లి గ్రామములకు పోయిరి. పాడపిల్లిలో 45 నిమిషములు మాత్రమే విశ్రాంతి తీసికొని అక్కడ వారు ప్రేమతో నిచ్చిన ఉపాహారములను స్వీకరించి మరలతో గుమ్మి, వేములూరు, పశ్వేదల గ్రామములలో సంకీర్తనము చేయుచు తిరిగి ఆశ్రమమునకు 4 40 నిమిషములకు చేరిరి. గత దినమున నేయే గ్రామమునకు ఎన్ని గంటలకు వచ్చునది తెలియపరచుచు కరపత్రములను పంచిపెట్టిరి. సరిగా ఒక నిమిషము కూడ తప్పకుండ ఆయా గ్రామములలో ఆయా నిమిషములలో జాతీయపతాకములతో, ఖద్దరు వస్త్రములను ధరించి జాతీయ గీతములను పాడుచు యింతమంది వీధులవెంట తిరుగుచుండగా జూచి జనులు ఆయుత్సాహమును ఆశ్చర్యమును కనబరచిరి. ఆశ్రమ స్థాపకులగు శ్రీ తల్లాప్రగడ నరసింహాశర్మగారు పెద్ద జండాను తీసికొని ముందు నడచుచుండిరి. ఆశ్రమ బాలురును యితర మిత్రులును కొందరు దీన్ని వెంట నడచుచుండిరి. శ్రీ తల్లాప్రగడ నారాయణమూర్తిగారు "జండాయెత్తండి రాటమును బట్టండి, పంచమద్రోహమును పాటించకండి" యను పాటను చక్కగా పాడుచుండ మిగిలినవారు వారి ననుసరించుచుండిరి. శ్రీ బ్రహ్మశ్రీ కోదండరామయ్యగారు, నోటీసులను పంచిపెట్టుచు గ్రామములలోని ప్రజలకు యీ ఉత్సవ సందర్భములను బోధపరచుచు సాయంకాలపు సభకు అందరను ఆహ్వానించుచుండిరి. శ్రీ వెలియ్యం సూర్యనారాయణగారును యితర మిత్రులును ఖద్దరు వస్త్రములను భుజములపై వేసికొని విక్రయించుచుండిరి. ఎండయనక ఈ విధముగా ఒక్క నిమిషమైనను తప్పక యింతమంది పల్లెగ్రామములలో వీధుల వెంబడి సుమారు 30 మైళ్లు అతి ఉత్సాహముతో తిరుగుచున్న యీశాంతిసైనికులను చూచినప్పుడు ప్రజలు కనపరచిన ఉత్సాహమును చూచి తీరవలసినదే కాని చెప్పశక్యముకాదు. మరల 1921 జ్ఞప్తికి వచ్చినది. పోయిన ఉత్సాహము తిరిగి కలిగినది. నిజముగా స్వరాజ్యమును తప్పక సంపాదింపగలమను ధైర్యము కలిగినది. సరిగా 5 గంటలకు జాతీయపతాకముక్రింద మహాసభ జరిగినది. చుట్టుపట్ల గ్రామములనుండి ప్రజలు చాలమందివచ్చిరి. మార్కొండపాడు, గౌరిపల్లి, మల్లవరం, చంద్రవరం, కుంకుడుమిల్లి మొదలగు గ్రామములనుండి పంచములుకూడా వచ్చిరి.

5 గంటలకు సరిగా నరసింహాశర్మగారు తీర్మానమును చదివి ఆమోదమునకు సభయెదుట బెట్టిరి. సభలోనివారు కొంతమంది తమకది బోధపడలేదనియు, దానినిగురించి చెప్పుమనియు కోరిరి. బ్రహ్మశ్రీ కోదండరామయ్యగారు, యీదినమున ఉపన్యాసములు చేయగూడదని కాంగ్రెసువారి ఆజ్ఞయగుటచే నట్లుచేయుటకు వీలులేదని విన్నవించిరి. కాని భావము క్లిష్టముగా నున్నందున దానిని చదివి అర్థము చెప్పుటలో తప్పులేదని నరసింహాశర్మగారు తీర్మానములోని ప్రతివాక్యమును చదివి అర్థము చెప్పిరి. తీర్మానమామోదింపబడెను. వెంటనే శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారును నారాయణమూర్తిగారును, పాటనుపాడిరి. ఆశ్రమవాసు లందరును కలిసి "జయ్ జయ్ భారత్" అను జాతీయ మంగళ గీతమును పాడుటతో సభ ముగిసినది. శ్రీ బ్రహ్మశ్రీ కోదండ రామయ్యగారు సభకు వచ్చినవారికిని, ఆశ్రమ నిర్మాణమునకు కారణభూతులైన శ్రీ లక్ష్మీంసాని గంగరాజుగారికిని, శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారికిని స్తుతించుచు అందరకును వందనములు సమర్పించిరి. ఇంకను ఇట్టి సభలు జరుపవలెననియు అందరును రావలెననియు హెచ్చరించిరి.

(ఒక విలేఖరి)

### నెల్లూరు

(ప్రత్యేకవిలేఖరి)

నెల్లూరు పట్టణమున, సంపూర్ణ స్వాతంత్ర్య దినము మిక్కిలి చక్కగా జరుపబడినది. ఉదయం 8 గంటలకు శ్రీ తిప్పరాజు వారిసత్రం ఖాళీ ప్రదేశములో, క్రొత్తగా తయారుచేయబడిన గొప్ప జాతీయజండా శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్యగారిచే ప్రతిష్ఠింపబడెను.—శ్రీయుత రాళ్లపల్లి రామసుబ్బయ్యగారు 'ఖండాంతరముల ఖ్యాతిగాంచి' అను పాటను మిక్కిలి యుత్సాహముతో పాడగా ఇతరులుకూడ పలుకుటచే గంభీరముగా నుండెను.

పతాక ప్రతిష్ఠానంతరము, 12 మంది కాంగ్రెసు ప్రచారకులు, శ్రీయుత రాళ్లపల్లి రామసుబ్బయ్య, తూములూరు అనంత పద్మనాభయ్య, యనమండ్ర సంజీవయ్య, నవలూరు సుబ్రహ్మణ్యం, కొమాండూరు పార్థసారథిఅయ్యంగారు, చింతపల్లి లక్ష్మీనరసింహం, నీరపాపయ్య, మొదలగువారు, ఖద్దరు సంచులను భుజములపై వేసికొని, బ్యాండు మేళముతో తిప్పరాజువారి సత్రమునుండి ఊరేగింపుగా ట్రంకురోడ్డుమీదుగా, బజారు కుమ్మరి అంగళ్లు, కొయ్యగాంపేని అంగళ్లమీదుగా, బజారువీధి గుండా, ఏగుదలగారి వీధినుండి, ఆచారివీధిలో నుండి దక్షిణముగా పోయి సంతపేటలో ఎక్కి, స్టేషనురోడ్డుమీదుగా, వరదాసుగారి అంగడి వద్ద చేరిరి. వీరికి ఎదురుగా కొందరు స్త్రీలు జాతీయజండాలతో భజనచేయుచు వచ్చి, గాయకులతో కలసికొని వెనుకకు తిరిగిరి. ఈ ఖాదీ అమ్మకపు ఊరేగింపు మిక్కిలి యుత్సాహముగా జరిగినది. అందరును ధరింపవలెనని అను పాటలతో, శ్రీ రాళ్లపల్లి రామసుబ్బయ్యగారు ఉపన్యాసము లిచ్చుచువచ్చిరి.

ఆ రోజు సాయంకాలము 4-30 గంటలకు, తిప్పరాజు సత్రం పెద్దజండా, క్రొత్తగా ప్రతిష్ఠాపింపబడియుండు దానిదగ్గర రోడ్డుబాట వీధిపెండలియు, ఇతరజండాల నాలుగువైపులను జనము విశేషముగా నుండెనుండిరి. శ్రీయుత రాళ్లపల్లి రామసుబ్బయ్యగారు, పెద్దజండాక్రింద రాట్నముపట్టుకొని వడకుచు కూర్చుండిరి. జనము దగ్గరకు చేరనీకి మీటింగు స్థలమంతయు జాతీయ పతాకములచే అలంకరింపబడియుండెను. సభకు కానుండిన దని 5 గంటలకు సభా కార్యక్రమము ప్రారంభింపబడెను. నెల్లూరువారును, బి. ఏ. లాక్ టి అయియుండి హైస్కూలు ఉద్యోగమును వదలి 1921 సంవత్సరం ఆందోళనమున పాకల పల్లిపాడు ఆశ్రమము ప్రవేశించి అచ్చటనుండి మద్రాసు స్వరాజ్య కార్యాలయముచేరి అందు సహాయసంపాదకుడుగా ఈ 9 సంవత్సరములు పనిచేసి, వదలివచ్చి ఇప్పుడే ఊరుచేరియుండువారైన శ్రీయుత కాశా సుబ్బారావు పంతులుగారిని అధ్యక్షులుగా నుండవలసినదిగా శ్రీయుత బొమ్మా శేషురెడ్డి (కార్యదర్శి) కోరగా, సభవారు కరతాళములతో ఆమోదింపగా, వారు అంగీకరించి ఆసనమలంకరించిరి. వారు ప్రారంభోపన్యాసముగా ఏమియు చెప్పక ఒక మాట చెప్పిరి "మహాత్ముని ఆజ్ఞానుసారము నేటిదినము ఏ ఉపన్యాసములును కూడదు. కావున ముందు ప్రార్థన జరుగగానే శ్రీయుత గూడూరు శేషారెడ్డిగారు అఖిల భారత కాంగ్రెసు సంఘమువారు పంపియుండు తీర్మానము చదువబడెను మీరందరు అందున కంగీకరించినచో, మీచేతు లెత్తి సంపూర్ణామోదమును తెలుపవలెను" అని కూర్చుండిరి. శ్రీయుత రాళ్లపల్లి రామసుబ్బయ్యగారు, "ఝండా ఉంచారహె హమారా" అని సిక్కులు పాడియుండిన ఉద్రేకపూరితమగు జండాపాటను పాడగా, శ్రోతలలో అనేకులు తోడుపలుకగా జనులు ఉద్రేకపూరితులై యుండిరి. శ్రీయుత దేశిరెడ్డి శేషారెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర సంఘమువారు పంపియుండు తీర్మానమును విపులముగా గంభీరముగా చదివిరి. వెంటనే అధ్యక్షులు అందరు అంగీకరించుచున్నారా అని అడిగిరి. అందరును, ఒకగుంపుగా చేతులెత్తిరి. చేరియుండిన జనము వేయింటికి కొంచెముపైగా అంచనా వేయబడినది. అటుపై అధ్యక్షులు ఎవరైన ప్రతికక్షులున్నారా అనియడుగ, శ్రీయుత బొమ్మా శేషురెడ్డిగారు ఎవరైనను ప్రతికక్షులున్నా, తమ నిజాభిప్రాయము దాపక వెలికి తెలుపుట ధర్మముగాన అట్లుచేయవలసినది అనికోరిరి. ఎవరును లేదనిరి. అంత తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడినట్లు అధ్యక్షులవారు తీర్మానించి సభను ముగింపు చేయుచున్నాను అనిరి. శ్రీ దేశిరెడ్డి శేషారెడ్డిగారికి మాత్రము అంత త్వరగా సభ ముగించుట తృప్తి లేకపోయినది. ఇంకను విపులముగా ఉపన్యసింపవలెనని పట్టుబట్టిరి. అధ్యక్షులు వగైరాలు వారిని ఆపుట కష్టమయ్యెను. ఆసభ పూర్తి అయినవెంటనే తాను ప్రత్యేకముగా ఉపన్యాసమిచ్చుచున్న, తనకు తృప్తిగా నుండలేదనిరి అంతకును వలదని అనిరి.

శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్య, కె. వి. రాఘవాచార్యులు విస్సా రామగోపాలరావుగార్లు, ఇట్టి పనికి మస్తుహారుకు పోయియుండిరి, ఇచ్చటి సభ ముగింపు సమయమునకు వచ్చిరి.

పినాకిని ఆశ్రమము తరఫున, త్రాగుడువలన దేశమునకు కలుగుచుండు ద్రవ్యనష్టము యొక్క వివరములను, కరపత్రములుగా ప్రచురించి పంచిపెట్టిరి. బహిరంగసభ స్థలమున, శ్రీయుత తూములూరు అనంత పద్మనాభయ్యగారు ఖద్దరు సంచులను పెట్టియుండి అమ్ముచుండిరి. యనమండ్ర సంజీవయ్యగారు క్రొత్త సభ్యులను చేర్చుటలో పూర్తిపని చేయుచుండిరి.

### బెజవాడ

#### శ్రీ సుభాసు చంద్రబోసు ప్రభృతుల నభినందించుట

26 తేదీని పూర్ణస్వరాజ్య సభానంతరం అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతనే జరిగిన సభలో కలకత్తాలో నిర్బంధింపబడిన శ్రీ సుభాసు చంద్రబోసు, కిరణశంకరరాయి, జె. యం. దాసగుప్త మొదలగు బెంగాలునాయకులను అభినందించుచు, ప్రభుత్వచర్యను నిరసించుచూ శ్రీ కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారు తీర్మానము ప్రతిపాదించిరి. శ్రీ నరసింహం నారాయణానందస్వామి మున్నగువారు బలపరచినపిమ్మట ఏకగ్రీవముగ తీర్మానము ఆమోదింపబడెను. (ఒకవిలేఖరి)

* * *

### కొణకంచి

ది 26 జనవరి ఉదయమున కాంగ్రెసువారి తీర్మానము ననుసరించి మా గ్రామపౌరుల పక్షమున జాతీయపతాకము శ్రీయుత అనుమల రామగోవిందశర్మగారిచే స్థాపింపబడినది. గ్రామములోని చిన్నపెద్ద లందరు నీయుత్సవమున పాల్గొనిరి. 10 గంటలకు చిన్నచిన్న జాతీయపతాకలు పంచిపెట్టబడినవి. గ్రామములో పెద్దపెద్ద యిండ్లకడ ఉన్నతస్థలములలో స్థాపింపబడెను.

సాయంత్రం 5 గంటలకు జాతీయపతాకవద్ద సుమారు నూరుమంది జనముతో బహిరంగసభ జరుపబడినది. ఆసభలో 18 తేది ఆంధ్రపత్రికలో ప్రచురింపబడిన తీర్మానము శ్రీయుత రామగోవిందశర్మగారిచే బిగ్గరగా చదువబడినది. తీర్మానమును అందరు ఆమోదించి చేతులెత్తిరి. ఈ కార్యక్రమము ఆరంభము నుండి చివరవరకు పోలీసువారు ఇచ్చట నేయుండి జరిగిన స్థితిని వ్రాసికొని వెళ్లినారు. (గ్రామపౌరుడు)

* * * * *

### అనకాపల్లి

26-1-30, ఆదివారం — ఈ ఉత్సవ సందర్భములో అఖిల భారత కాంగ్రెసు సంఘమువారి సందేశము ప్రకారము నాలుగు దినములకు ముందుగానే యిచ్చటి ప్రజలకు 26 తేదిని జరుపవలసిన కార్యములను ఆనాడు బహిరంగ సభలో ఆమోదించవలసిన తీర్మాన వివరములను వీధులవెంట ప్రబోధముచేయుచు కరపత్రములమూలమున వెల్లడిచేయడమైనది.

నాటి ఉదయము గం॥ 7 లకే కాంగ్రెసు సభ్యులును అభిమానులును జాతీయ పతాకలతో యీపురమున గాంధీ మార్కెట్టులో నెలకొల్పబడిన స్వరాజ్య ధ్వజమువద్దకు చేరి పతాకయొక్క ప్రాముఖ్యతను గౌరవమును వెల్లడించి వందనము చేసి పిమ్మట సభ్యులలో కొందరు వీధులవెంట ఖద్దరు విక్రయముచేయుట, మద్యపానవిక్రయశాలకు పోయి మద్యపాన దురభ్యాసమును మానుటకై బోధించి పంచములదరికేగి నిర్మాణ కార్యక్రమున కాంగ్రెసువారు నిర్ణయించిన విధులలో వారిని కూడ తోడ్పడుడని బోధన చేయడమైనది.

సాయంకాలము గం॥ 4 కే పురవీధులలో నగర సంకీర్తన చేయుచు స్వరాజ్య ధ్వజమువద్దకు చేరి సరిగా గం॥ 5 లకు తీర్మానమును సభలో చదివి సభ్యుల ఆమోదమును కోరబడెను. సభకు సుమారు 400 లకు పైగా హాజరయిరి. తీర్మానమును అందరును ఏకగ్రీవముగా చేతులెత్తి ఆమోదించిరి.

(ఒక విలేఖరి)

# సంపూర్ణస్వరాజ్యమహోత్సవము

## ఆంధ్రదేశము

### పెదనందిపాడు

26-1-30 సాయంత్రం మా గ్రామ కాంగ్రెస్ సంఘమువారి యాజమాన్యమున జాతీయపఠనీయ గ్రంథాలయములో సభజరిపి అఖిలభారత కాంగ్రెస్ కమిటీవారి సంపూర్ణ స్వాతంత్ర్యప్రకటన జదువబడినది. సభకువచ్చినవారెల్లరును సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానము నామోదించిరి. గాంధి మహాత్మునకు జయ్ యను ధ్వానములతో సభ ముగింపబడినది (ఒక విలేఖరి)

### చేబ్రోలు

26-వ తేదీని జాతీయపతాకమును రాత్రి 5 గంటలకు బహిరంగసభ జరిగెను. ఆ సభయందు లాహోరు కాంగ్రెస్ తీర్మానములను గురించి బాపిరెడ్డిగారు, బ్రజనందన్, లక్ష్మీకాంతరావుగార్లు మాట్లాడిరి శ్రీ రామేశ్వరరావుగారు అధ్యక్షపదవియందుండిరి వందనములతో సభ ముగిసెను. (ఒక విలేఖరి)

### గుత్తి

26-వ తారీఖున గుత్తి గ్రామమునందు లండన్ మిషన్ విద్యార్థులు సంపూర్ణ స్వరాజ్యమహోత్సవము జరిపిరి. ప్రాతఃకాలమున మహాత్మ లోకమాన్యతిలక్ పండిత జవాహిర్లాల్ నెహ్రూగార్ల పటములు ఊరేగింపబడెను. హైందవ పతాకంబుతో ఉత్సవము జరుపబడెను.

మరి రాత్రి శ్రీ. యం. సేతురామగారు బి. ఏ. బి. యల్. ఉత్సవము వెంటవచ్చి విద్యార్థులను ప్రోత్సహించిరి. ఉత్సవము గాంధికిజే అను శబ్దములతో మ్రోగెను ఉత్సవము అయిన తరువాత ఎం. సేతురావుగారు 'సంపూర్ణ స్వరాజ్యము' గూర్చి బాగుగా నుపన్యసించిరి. (ఒక విద్యార్థి)

### పొదురు

పొదూరు గ్రామములో ఈనెల 16-1-30 తేదీని అఖిల భారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి ఆజ్ఞానుసారము ఉదయము 8 గం॥ సన్నాయి, ఢోలు మేళములతో గ్రామ వీధులయందు జయప్రదముగా పూర్ణస్వరాజ్యపతాకోత్సవము జరిపి పుస్తకభాండాగారమువద్ద పతాక మెగురవేయబడినది. అ సాయంత్రము 6 గం॥ బహిరంగసభలో 'సంపూర్ణస్వాతంత్ర్య తీర్మాన' మేకగ్రీవముగా అంగీకరించబడినది. వ్యతిరేకులు లేరు సభ జాతీయపతాకవందనములతో ముగింపుచేయబడినది.

(ఒకవిలేఖరి)

### నందిగామతాలూకా చందపాలెం

ది26 తేదీ పురస్కరించి మా గ్రామ పౌరుల పక్షమున కాంగ్రెసువారితీర్మానానుసారం జాతీయపతాకము శ్రీయుత రేపాల శేషయ్య శ్రేష్ఠిగారిచే స్థాపింపబడినది గ్రామములోని చిన్న పెద్దలందరు నీయుత్సవమున పాల్గొనిరి 10 గంటలకు చిన్న చిన్న జాతీయపతాకములు పంచిపెట్టబడినవి. గ్రామములో పెద్ద పెద్దయిండ్లకు ఉన్నతస్థలములలో స్థాపింపబడెను

సాయంత్రం 6 గంటలకు జాతీయపతాకమువద్ద బహిరంగసభ జరుపబడినది. ఆ సభలో 18 తేది ఆంధ్రదైనిక పత్రికలో ప్రచురింపబడిన తీర్మానము శ్రీయుత రేపాల బుచ్చిరాము శేషయ్య శ్రేష్ఠిగారిచే బిగ్గరగా చదువబడినది. తీర్మానమును అందరు ఆమోదించి చేతులెత్తిరి. పోలీసువారు 12 గంటలకు మా గ్రామమును వచ్చి విచారించి పోయిరి (ఒక విలేఖరి)

### పోకూరు

26-వ తేది సాయంత్రము 6 ఘంటలకు బహిరంగ సభచేసి లాహోరు కాంగ్రెసువారు తీర్మానము చేసిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము వెయ్యిమంది ప్రజలు శ్రీయుత ఆనంట లక్ష్మీనరసింహంగారి అధిపత్యముక్రింద ఏకగ్రీవముగా నామోదించిరి. తరువాత శ్రీ మహాత్ముని ఛాయాపటమును త్రివర్ణ పతాకము గ్రామములో చిన్న పెద్దలు నూరున్నమంది చేరి పరమానందముతో నత్యంత వైభవోపేతముగ స్వాతంత్ర్య గీతములతోడను మంగళ వాద్యములతోడను, భజనలతోడను, మహాత్ముని జయధ్వనులతోడను, గ్రామమంతయు దిరుగుచు రాత్రి 8 ఘంటల పర్యంతము వుత్సవము జేసిరి (ఒకవిలేఖరి)

### పిఠాపురం

సంపూర్ణ స్వరాజ్య మహోత్సవ-మీ పట్టణమున నత్యుత్సాహముతో జయప్రదముగ జరుపబడినది ఉదయము 7గంటలకు పెద్దబజారునుండి పతాకోత్సవము బయలుదేరి కోటగుమ్మము మీదుగా కుమారనగరం, మంగాయమ్మారావుపేట వరకు సాగినది. కుమారనగరమునుండి సన్యాసిరాజువీధి, వంగవారివీధి, కోటవారివీధి, దేవాలయపు వీధుల వెంబడి సన్నాయి, నగారా వాద్యములతో కాంగ్రెసు ప్రముఖులు, వర్తకులు, రైతులు, కార్మికులు మున్నగు పురపెద్దలును, పెక్కు విద్యార్థులును, జాతీయపతాకలతో, ఊరేగింపు సాగించిరి పెద్దమసీదువద్దనుంచి హైస్కూలువరకు కేడుగగమున్న సామ్నాద మందిరమును చేరునప్పటికి 10 గంటలైనది శ్రీయుత గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారిచే స్వరాజ్యపతాక ప్రతిష్ఠింపబడెను

సాయంకాలము 6 గంటలకు సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానము బహిరంగ సభలో శర్మగారిచే చదువబడెను సభకు సుమారు దుసందలమంది హాజరై తీర్మాన మేకగ్రీవముగ నామోదించిరి (ఒకవిలేఖరి)

### పుంగనూరు

స్వాతంత్ర్యదినోత్సవము, జరుపవలెనని చెప్పబడియుండుటచే గవర్నమెంటు యుద్యోగస్థులద్వారా జరుపబడెను 26 తేది మధ్యాహ్నం 12 గంటలవరకును స్వాతంత్ర్య దినోత్సవమును గురించి ప్రజలెవరును తెలిసినవారు కారు. అయితే దైవసంకల్పము కొంత తెలియుటకు పుంగనూరు సబ్ మేజిస్ట్రేటువారున్ను అసిస్టెంటు సూపరెంటుగారన్ను స్వాతంత్ర్యదినోత్సవమునకు సంబంధపడిన తిరుపతిలో ప్రచురింపబడినట్టువంటి కరపత్రములు వున్నవా అని మా రాజీ సోమన్నగారి యింటిలోను, కోఆపరేటివు స్టోర్సులోను వెతకిరి. అయితే అవికనబడలేదు యీసందర్భముచేత అనేకజనులు చేరి, స్వాతంత్ర్యదినోత్సవమును గురించియు జాతీయమహాసభయొక్క తీర్మానములను గూర్చి విశేషముగా చెప్పుటన్ను అందోళనమున్ను జరిగి యీలాటిగలభా లేకుండ స్వాతంత్ర్య దినవుత్సవము కడతేరెను దీనికి గౌర్నమెంటు వుద్యోగస్థులు కృతజ్ఞులు.

(ఒకవిలేఖరి)

### రాజోలు తాలూకా ఉచ్చిలి

మా గ్రామమున 26-1-30 వ తేదీని 10 గంటలకు మ. రా శ్రీ పెరివర్ల వెంకట్రామగారి యాజమాన్యమున సుమారు 200 మంది ఖద్దరు వస్త్రధారులై జాతీయగీతములతోడను, మంగళ వాద్యములతోడను గ్రామమంతయు ఉత్సవము జరిపి కచ్చేరీసావిడివద్ద జాతీయపతాకము నెలకొల్పిరి. సాయంత్రము 5 గంటలకు (జన్మభూమి) కాకచైనుల మార్యనారాయణగారి యాజమాన్యమున గొప్ప బహిరంగసభ ఏర్పాటు చేయబడెను రాజమండ్రి తాలూకాబోర్డు ఉపాధ్యక్షులగు మ. రా శ్రీ వంటూరి జగ్గరాజుగారు అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులచే ప్రచురింపబడిన తీర్మానముయొక్క ఆవశ్యకతను గురించి తెలియజరచిన పిమ్మట మ. రా శ్రీ వంటూరి సుబ్బరాజుగారిచే 5 గంటలకు తీర్మానము చదువబడి సభ్యులందరిచే ఏకగ్రీవముగా నామోదింపబడి 6 గంటలకు జయధ్వనులతో సభ ముగింపబడెను. (ఒక విలేఖరి)

* * * *

### ఉమ్మగల్లు (బెజవాడ తాలూకా)

అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘ సభ్యసమితిని సంపూర్ణ స్వరాజ్య మహోత్సవము నేడు (26-1-30) కడు వేడుకతో నిర్వహింపబడినది జాతీయపతాకము ప్రతిష్ఠింపబడి పురవాసులు రాజవీధుల త్రివర్ణ జాతీయపతాకములు చేబూని జయజయ ధ్వనులు చెలరేగ పాడుచారలై పదసాహిత్యము వెలిబుచ్చుచు దేశారాధన తత్పరుల విగ్రహములను సత్వర స్వరాజ్య సాధనంబగు రాట్నమును శకటమునందధిష్ఠింపజేసి స్వరాజ్యము నా జన్మహక్కని జీవితాంతరము బోధసల్పిన లోకమాన్యుని యొక్కయు శాంతిధర్మ సేనయైనట్టి సువహింపు ధర్మమును మానవసామాన్యమునకు దివారాత్రములు బోధించుచున్న మహాత్మ గాంధిగారి యొక్కయు ఛాయాపటముల మోటారునందలంకరించి, మంగళవాద్యములును, వైవేద్య హారతులును జయప్రదముగ నూరేగింపు సల్పిరి. మా గ్రామ యువకబృందము స్వరాజ్య సాధకోద్యమము తనపైని ఆధారపడియున్నదని పూర్ణముగ గ్రహించి అత్యుత్సాహపూరితులై మహాత్మ గాంధికిజయ్ వందేమాతరం అను జయధ్వనులతో ఉత్సవమును ఫలాకారము చేసిరి సాయంకాలమగుసరికి ఆబాలగోపాలము ప్రజలు గుమిగూడి యొక సభ చేసిరి ఆ సభయందు అఖిలభారత జాతీయ మహాసభవారిచే పంపబడిన సందేశమును శాంతముగ పఠింపబడినది. ఆ సందేశమును జనులందరు ఆమోదించి సంపూర్ణ స్వాతంత్ర్యమునకు సంసిద్ధులమై యున్నామని తమ ఉత్సాహమును వెలిబుచ్చిరి. తరువాత జవహిర్లాల్ కు జయ్. సుభాసుకు జయ్ అను ధ్వనులతో సభ ముగిసెను.

ఉమ్మగల్లు యువజనబృందము.

### గుడివాడ

25 వ తేదీని చెరువుకట్టున గాంధిచౌకునందు లాహోరు కాంగ్రెస్ విషయముల చర్చించుటకుగాను మొదట లాహోరు కాంగ్రెస్ సమావేశమును గూర్చి గూడూరి వెంకటచలముగారు చెప్పిన పిమ్మట శ్రీయుత చెరుకువాడ నరసింహంగారు సర్వజనాహ్లాదకరముగా నుపన్యసించిరి. సహాయనిరాకరణోద్యమానంతరము దేశమందు కలిగిన రాజకీయ పరిస్థితులను విపులముగా నుపన్యసించుచు సంపూర్ణస్వాతంత్ర్యదిన కార్యక్రమమును ప్రజలకు విశదపరచిరి.

26 వ తేదీని ఉదయము 7 గంటలకు గాంధిచౌకునందు సుమారు 100 మంది జనము సమావేశమయిరి. కార్మిక సంఘమువారు ఉదయమునసే లేచి పెద్ద కాల్వకు పోయి స్నానమాచరించి భజనతో వటువచ్చిరి. విద్యార్థులు పెక్కుమంద్రు కూడిరి. ఆరంభమందు శ్రీయుత బుర్రా రామశేషయ్యగారు జాతీయ గీతముల పాడిరి తరువాత విద్యార్థులతోను, కార్మికులతోను కూడిన జాతీయపతాకోత్సవము బయలుదేరెను 'సంపూర్ణస్వాతంత్ర్యతీర్మాన కరపత్రముల ఇంటింట పంచిపెట్టుచు జాతీయపతాకము నూరేగించిరి తిరిగి 10 గంటలకు గాంధిచౌకునందు గూడిరి శ్రీయుత మానుగంటి వెంకట్రావుగారు జాతీయపతాకమును స్థాపించిరి.

తిరిగి సాయంత్రము 5 గంటలకు సమావేశము గూడెను. సుమారు 600 మంది జనము గూడిరి పట్టణకాంగ్రెస్ సంఘ కార్యదర్శిగారగు శ్రీయుత వల్లమూడి సత్యనారాయణగారు సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానమును చదువగా సుమారు రెండువందల మంది హస్తము లెత్తి తమ యామోదముల తెల్పిరి కొంతమంది తటస్థులుగా నుండిరి గాని వ్యతిరేకులెవ్వరును లేరు.

అంతట మొదటినుండి కాంగ్రెసు కార్యక్రమమందు ఎక్కువ ఉత్సాహము జూపిన కార్మికసంఘమువారు తమకు ప్రత్యేకసమావేశము గావింపవలెనని కోరుటచే రాత్రి 10½ గంటలకు వారిచే కట్టింపబడిన రామాలయమందు సభజరుపబడెను కార్మికులు చాలమంది విచ్చేసిరి మొదట శ్రీయుత అప్పలస్వామిగారు మద్యపానవిషేధము ప్రబోధించుచు పద్యముల మనోహరముగా చదివిరి శ్రీయుత చెరుకువాడ నరసింహంగారు మద్యపానవిషేధమును చర్చించుచు మితపాన మమితపానమునకే దారి యని యు ఇద్దరే కార్మికుల దుస్థితిని తొలగించు సాధనమనియు నుపన్యసించిరి. కార్మిక నాయకులు వారివారి యిండ్లలో నాలుపటికించెదమనిరి సభాంతమందు వారి నాయకులగు శ్రీయుత అప్పలస్వామి, రామస్వామి గార్లు దీక్షతో గట్టెదమని ప్రతినగావించిరి వందనములతో సభను ముగించిరి.

(ఒకవిలేఖరి.)

### బండ్యాత్మకూరు (నంద్యాల తాలూకా)

26-1-30 ఉదయము 8 గంటలకు దాదాపు 300 ప్రజలచే, స్వరాజ్యపతాక, బ్యాండు, తప్పెటలమధ్య గ్రామమంతయు ఊరేగింపబడి, దేవాలయముముందర స్వరాజ్యపతాక స్థాపన చేయబడినది.

సాయంకాలము బహిరంగసభయందు, చుట్టుపట్ల గల గ్రామముల ప్రజలు ఈ గ్రామప్రజలు కలసి 300 ప్రజలు మ రా రా శ్రీ చదుల్ల శివారెడ్డిగారి అధ్యక్షతక్రింద సమావేశమయి స్వాతంత్ర్యతీర్మానములు యేకగ్రీవముగా అంగీకరింపబడినవి

ఇప్పటి అనేకులు కాంగ్రెసునందు సభ్యులుగ చేర వలెనను గల్గినవారై నందున, నంద్యాల కాంగ్రెసుకమిటీ సెక్రటరీ గారికిని, ఈ గ్రామమునకు వచ్చి కాంగ్రెసు సంస్థ యేర్పాటుచేయ ప్రార్థింపడమైనది. 200 దీనులకు అన్నదానము చేయడమైనది. (ఒకవిలేఖరి)

### రేలంగి

మా గ్రామములో కాంగ్రెసు ఆజ్ఞానుసారముగా 26-1-1930 సంవత్సరం తారీఖున ఉదయము బ్యాండు మేళముతో పురవీధులగుండా స్వరాజ్యపతాక మహోత్సవము జయప్రదముగా జరిగినది మహమ్మదీయ సోదరులు ఎక్కువ శ్రద్ధగా ఉత్సవమందు పాల్గొనినారు. మధ్యాహ్నము 3 ఘంటలకు శ్రీ రాములవారి ఆలయమువద్ద శ్రీ వసింపల్లి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతక్రింద సభ జరిగినది.

తీర్మానము:— దేశీయ కాంగ్రెస్ లాహోరులో చేసిన సంపూర్ణ స్వరాజ్యతీర్మానమును యీ సభవారు ఆమోదించుచున్నారు. అనే తీర్మానమును సాగి సుబ్బరాజుగారి వల్ల ఉపపాదించబడి పెనుమెత్స నారపరాజుగారివల్ల ఆమోదించబడి సభవారిచే ఏకగ్రీవముగా అంగీకరించబడినది. (విలేఖరి.)

## తెనాలి (26-1-30)

మా తెనాలిపట్టణవాసులుకూడా భారతదేశమందలి యితర పట్టణములతోపాటు మాతృభూమి స్వాతంత్ర్య మహోత్సవము యథాశక్తిగ జరిపినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు సమర్పించుచున్నాను.

ఉదయం 8 గంటలకు తిలక జాతీయ పాఠశాలవద్ద శ్రీయుత బ్రహ్మాండం నరసింహంగారిచేత జాతీయ పతాకము యెత్తబడెను. పుష్పములతోడను జాతీయపతాకముల తోరణములతోను నలంకరింపబడిన రథమందు భారతమాత పటమునుంచి యిరుపార్శ్వములు మహాత్మాగాంధి జవహర్‌లాల్ గార్ల పటము లమర్చబడి జాతీయగీతములు పాడుచు మంగళవాద్యములతో చూచువారలకు ఆనందదాయకముగనుట్లును, స్వాతంత్ర్యము త్వరలోనే చేకూరదు అనే సందియము లేదనునట్లుగను, జాతీయపాఠశాలవద్దనుండి ఉత్సవము బయలుదేరెను మారీసుపేటయందలి కొందఱు కాంగ్రెసు యువకులు వారి పేటయందలి పఠనమందిరమందు జాతీయ పతాకము నెలకొల్పి మరొకరథమును భరతమాత, యితరదేశ నాయకుల పటములతో నలంకరించి జాతీయపాఠశాలవద్ద బయలుదేరిన వుత్సవముతో వచ్చి కలసిరి. ఈ రెండురథములతో పట్టణమందలి ముఖ్యవీధులందు వుత్సవము నడపబడెను. పురజనులు అత్యుత్సాహముతో హారతులు సమర్పించిరి. గాంధిచౌకునందు కొట్ల యజమానులు తోరణములతో నలంకరించి ఒక పెద్ద జాతీయపతాకమును గాంధీచౌకునందు నెలకొల్పిరి. మూడువందలమందికి పైగా వుత్సవమునందు పాల్గొనిరి.

మధ్యాహ్నము 12 గం నుండి 4 గంటలవరకు పట్టణమందు ఖద్దరు సంచారవిక్రయము చేయబడెను

సాయంత్రము 5 గంటలకు గాంధిచౌకునందు శ్రీయుత బ్రహ్మాండం నరసింహంగారి అధ్యక్షతక్రింద ఒకసభ జరిగెను. షుమారు మూడువందలమందికి పైగా సభ్యులు హాజరైరి. అగ్రాసనాధిపతిగారే స్వాతంత్ర్యతీర్మానమును సభలో ప్రవేశపెట్టి విశదముగా చదివి వినిపించి పిమ్మట వోటుకు పెట్టగా యే విధమైన వ్యతిరేకాభిప్రాయము లేక యేకగ్రీవముగా తీర్మానింపబడెను. అప్పుడే కొంతమంది కాంగ్రెసు సభ్యులుగాకూడ చేరిరి

పట్టణకాంగ్రెసు సంఘం, తెనాలి } ధూళిపాళ సీతారామయ్య, సంయుక్తకార్యదర్శి

## కొప్రోలు (గుంటూరుజిల్లా)

అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి ఆదేశానుసారముగా ఈనెల 26 వ తేదీ ఆదివారమునాడు, యథాశక్తిగా స్వాతంత్ర్యవాసరోత్సవము మాగ్రామమందును జరుపబడెను.

ఉదయం 8 గంటలకు జాతీయ పాఠశాలా ప్రధానోపాధ్యాయులును, బాలురును, మరియు కొలదిమంది గ్రామవాసులును గత సంవత్సరము నవంబరు మాసాంతమున, పాఠశాల భవనమువద్ద స్థాపింపబడిన, జాతీయపతాకము చుట్టును చేరిరి. దైవప్రార్థనానంతరము, బాలుర ఉచ్చైస్స్వరముతో, జాతీయ కీర్తనలును, జండాకీర్తనయు, పాడిరి

పిమ్మట, సాయంత్రము 4 గంటలకు జాతీయ పాఠశాలా భవనము వద్దనుండి పూరేగింపు యథావిధిగా మేళతాళములతోడను, జయజయ ధ్వానములతోడను, బయలుదేరి గ్రామమంతయు తిరిగి, బయలుదేరిన స్థలమునకే తిరిగి చేరెను. తరువాత సాయంత్రము సరిగా 5 గంటలకు పౌరసభ శ్రీయుత తుమ్మల బసవయ్యగారి అధ్యక్షత క్రింద, సక్రమముగాను శాంతముగాను జరిగెను సభలో యెట్టి యుపన్యాసములు లేకయే, స్వాతంత్ర్య తీర్మానము జదువబడి సభవారిచే యేకగ్రీవముగా ఆమోదింపబడెను.

తదనంతరము, 15 మంది పౌరులు, కాంగ్రెసు గ్రామసంఘములో, సభ్యులుగా జేర్చబడిరి.

(ఒకవిలేఖరి)

## పెద్దకళ్ళేపల్లి (తిరువూరు తాలూకా)

సంపూర్ణ స్వరాజ్యదినోత్సవము జయప్రదముగా, యీ గ్రామమందు గ్రామ కాంగ్రెసు సంఘమువారిచే జరుపబడినది. [illegible] సుబ్రహ్మణ్యనాయుడు ఖద్దరు వస్త్రములను విక్రయించినారు సుమారు నూరురూపాయలఖద్దరు విక్రయింపబడినది సాయంత్రం 5 గంటలకు దేశీయ భజనపూరేగింపు జరిగినది [illegible] తీర్మానములను తెనుగులో అనువాదము పంచిపెట్టబడెను. [illegible], జాతీయ పతాకారోహణము జరుపబడెను సాయంత్రం 7 ఘంటలకు సభ జరిగినది సభకు [illegible] శ్రీనివాసులు నాయుడుగారు అధ్యక్షత వహించిరి గ్రామజనులు, [illegible] కలసి సుమారు 150 మంది హాజరైరి కాంగ్రెసు తీర్మానము చదివి జనులకు విశదముగా తెలియచేయడమైనది తీర్మానములు అధికసంఖ్యాకులచే నామోదింపబడెను. (ఒకవిలేఖరి)

## దేవరపల్లి

మా గ్రామమున 26-1-30 తారీఖున ఉదయము ఎనిమిది గంటలకు దేశసేవాపరాయణులును ఖద్దరుధారణదీక్షాపరులును అగు శ్రీయుత వామన బాపన్నగారిచే స్వరాజ్యపతాకోత్థాపనము చేయబడినది. మధ్యాహ్నము సుప్రసిద్ధ దేశభక్తులగు శ్రీయుత కర్రా కృష్ణమూర్తిగారు ఎర్నేని అచ్యుతరామరాజుగారు మొదలైనవారలచే నగరసంకీర్తనము చేయబడిన యనంతరమున యువకమండలివారు జాతీయగీతములచే శ్రోతల కుత్సాహంబు రెట్టింపజేయుచు 5 గంటలకు స్వరాజ్య ధ్వజము క్రింద సభచేసిరి. తరువాత ఆగ్రామ కాంగ్రెసుసంఘ కార్యదర్శిగారగు శ్రీయుత బొమ్మరాజు భాస్కరరావుగారిచే భారత కాంగ్రెసు సంఘమువారిచే తీర్మానింపబడిన తీర్మానములు సర్వజనులకు తేటతెల్లముగ వినిపింపబడెను. సభావస్థితులగు యావన్మందియు తమకు గల సంపూర్ణ స్వాతంత్ర్యాభిలాషను పూర్తిగగలదని వెల్లడించిరి. అంతటసభ ముగిసినది.

(ఒకవిలేఖరి)

## తణుకు

తణుకుపురమున 26 వ తేదిని కాంగ్రెసు సభాధ్యక్షుని ఆదేశానుసారము సంపూర్ణ స్వాతంత్ర్యమహోత్సవము జయప్రదముగ జరుపబడినది. ప్రాద్దున యువకులు జాతీయగీతములు పాడుకొనుచు బయిలుదేరి పురమందిరమున జాతీయపతాకము సరిగ 8 గం॥ లకు నిలబెట్టిరి. మధ్యాహ్నము పురవీధుల సుమారు 60 రూపాయల ఖద్దరు విక్రయించబడెను. సాయంత్రము సరిగ 5 గం॥ శ్రీయుత మంగిపూడి వెంకటశర్మగారి అధ్యక్షతక్రింద జరిగిన సభలో శ్రీయుత కొవ్వలి గోపాలరావుగారు స్వాతంత్ర్యతీర్మానము చదివివినిపించిరి ఈతీర్మాన మందరిచేతను ఏకగ్రీవముగ అంగీకరింపబడెను. సభ అనంతరము పురవీధుల జాతీయగీతములతో ఉత్సవము జరుపబడెను. ప్రజలలో చాలమంది ఇకముందు ఖద్దరు కట్టునట్లు వాగ్దానము చేసిరి

(ఒక విలేఖరి)

## చీరాల

జనవరి 27.—నిన్న ఉదయం గాంధీచౌక్ (మహాలక్ష్మమ్మచెట్టు) వద్దనుండి సరిగా 8½ గంటలకు స్వరాజ్యపతాకమహోత్సవము మంగళవాద్యములతోను, తప్పెట్లతోను జయజయధ్వానములతో బయలుదేరెను రాట్నము చిత్రింపబడిన త్రివర్ణజాతీయపతాకమువెంట పురప్రముఖులు సర్వపక్షముల వారు వెంటనడచిరి, మధ్య, మధ్య "మహాత్మాజీకిజై" "జవహర్‌లాల్ కి జై" "సుభాసుచంద్రబోసుకుజై" అను ధ్వనులు మిన్నుముట్టెను. ఆంధ్రరత్న గ్రంథాలయ సభ్యులు భాండాగారమువద్ద కొంతతడవాపి పతాకకు హారతినొసంగి ప్రసాదమును సభ్యులకు నొసంగిరి ఇవ్విధమున పురముఖ్యవీధులన్నియు పూరేగింపుజరిగి గాంధీచౌకునకు 10 గంటలకు చేరుకొని అచ్చట పతాకను ప్రతిష్ఠించిరి.

### బహిరంగసభ

పతాకచ్ఛాయను గం. 6 లకు బహుసంఖ్యాకులు సమావేశమైన మహాసభయందు కాంగ్రెసువారు ప్రచురించిన తీర్మానము చదివి సర్వజనాంగీకృతము కాబడుటతో సభ సమాప్తినొందెను

(ఒక విలేఖరి)

## రాజమండ్రితాలూకా

రాజమండ్రితాలూకాలో ననేక గ్రామములలో నీయుత్సవము దిగ్విజయముగా జరుపబడెను. 1921 వ సంవత్సరము తరువాత ప్రజ లిట్టి యుత్సాహమును జూపియుండలేదు కాతేరు, తొర్రేడు, హుకుంపేట, పిడింగొయ్యి [illegible], వెంకటనగరం, కొంతమూరు, కోలమూరు, దోసకాయలపల్లి, కోరుకొండ, వేమగిరి, కడియం, కేసవరం మొదలగు గ్రామములలో నీస్వాతంత్ర్యపతాకోత్సవమును, తీర్మానప్రకటనమును గావింపబడెను. గ్రామములోని పిన్నపెద్దలనేకు లీయుత్సవములలో పాల్గొనిరి. తీర్మానములోని యంశములన్నియు ప్రజలకు జదివివినిపింపబడెను. కరతాళధ్వనులు చెలరేగుచుండ ప్రజలందరును స్వాతంత్ర్య తీర్మానము నేకగ్రీవముగా నామోదించిరి మహాత్ముడు మరల శంఖారావమును బూరించుచున్నాడను వార్తనాకర్ణించి పలువురు ఉత్సాహపూరితులైరి. కాతేరు గ్రామములో నత్యాగ్రహమునకు జేరిన వీరన్నగారును, మరొకరును కాంగ్రెసు యెట్టి యాజ్ఞల నొసగినను శిరసావహించుటకు దృఢనిశ్చయులై యున్నామని ప్రకటించిరి. అనేకమంది ఖద్దరు నికనుండి తప్పక ధరింతుమనియు కాంగ్రెసు సభ్యుల మగుదుమనియు వాగ్దాన మొసగిరి దువ్వూరి సుబ్బమ్మగారి స్త్రీసనాతన విద్యాలయములోని బాలికలు జెండాపాటలను పాడుచు పైగ్రామములలో ప్రబోధము గావించిరి జిల్లాకాంగ్రెసు సంఘాధ్యక్షులగు వెన్నేటి సత్యనారాయణగారీసభలను స్వయముగా నేర్పాటుచేయించి దిగ్విజయముగా నడిపించిరి.

మద్దిగంటి జగన్నశాస్త్రి.

## కోటబొమ్మాళి (గంజాంజిల్లా)

26 తేదీ ఉదయం 8 గంటలకు భారతదేశీయ సభాధ్యక్షుని అనుమతి ప్రకారం యీగ్రామమందు మండల ఆంధ్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు శ్రీయుత కొండపల్లి సూర్యనారాయణరావు శర్మగారి యింటియందు జాతీయ పతాకము మహోత్సాహముతో ఎగుర వేయబడినది. గ్రామమందు నేడు సంతమూడు దినమగుటచే గ్రామస్థులతోపాటు యితర గ్రామస్థులును పతాకవందనోత్సవమందు పాల్గొనిరి. సాయంకాలము 5 గంటలకు పతాకము క్రింద శ్రీయుత టంకాల రంగన్న శ్రేష్ఠిగారి యధ్యక్షతను పౌరుల బహిరంగసభ జరిగినది ఇంతపెద్దసభ యిదివరకెన్నడీ గ్రామమందు జరిగి యుండలేదు. ఆదిమాంధ్రులు సుమారు 100 మంది సభకు వచ్చుట శుభసూచకముగా సభ్యులచే నెంచబడెను. దైవప్రార్థనానంతరము దేశీయమహాసభాధ్యక్షునిచే ప్రకటించబడి ఆంధ్రానువాద రూపమున యీనెల 18 వ తేదీ ఆంధ్రపత్రికయందు ప్రచురించబడిన సంపూర్ణ స్వరాజ్యతీర్మానము సభ్యు లందరిచే నేకగ్రీవముగా నామోదించబడినది. ఇతరవుపన్యాసములేవియు నియ్యబడలేదు. సభ్యులు 10 రూపాయిల మొత్తమును గంజాంమండల ఆంధ్ర కాంగ్రెసు కమిటీకి కట్నముగా సమర్పించినారు.

(ఒకవిలేఖరి)

---

## చిత్తూరు డి॥ ము॥ కోర్టులో

S. C 1048/26, E P 836/29.

Between

వాది:—అక్కారి రామిరెడ్డి,

And

ప్రతివాది:—బాలికాడ అచ్చిరెడ్డి.

నోటీసు

వాది ప్రతివాదిపై డిక్రిపొంది స్థావరసొత్తులను జప్తి చేయుటకుగాను అమలు చలాయించడములో, నోటీసుకుగాను 18-2-30 లో వాయిదా వేసియున్నది. సదరి వాయిదాకు హాజరు కాకపోయినయెడల ప్రతివాదిని యక్సపార్టీ చేసి జప్తికి వుత్తరవు చేయబడుననే సంగతి యిందువల్ల తెలియచేయడమైనది.

చిత్తూరు 16-12-29 } సి. శ్రీనివాస అయ్యరు, వాదితరఫు వకీలు.

---

## నోటీసు

## రేపల్లె డి॥ ము॥ కోర్టులో

O S 290/27, E P 29.

వాది:—బాలముకుందరావుగారు.

ప్రతివాద్లు:-వేదాల వెంకటవరదాచార్యులు వగైరా.

యీ దావాలో ప్రతివాదులకు సి. పి. సి. 21 ఆ 66 రూలు ప్రకారము వేలపు నోటీసులున్ను, సెం 150 ద రూలు ప్రకారము title deeds production నిమిత్తమున్ను. సి. పి. సి. 21 ఆ 72 రూలు ప్రకారము వాది పాటకు పర్మిషన్ నిమిత్తమున్ను నోటీసు నిమిత్తమున్ను ది 8-2-30 తేదికి వాయిదా వేసినారు. ఈ విషయమై ప్రతివాదులకు ఆక్షేపణలు వున్నయెడల సదరు తేది పగలు 11 గంటలకు సదరు కోర్టువారి యెదుట హాజరై తెలియపరుచుకొనగలందులకు యిందుమూలముగా తెలియపర్చడ మయినది.

రేపల్లె 28-1-30. } (సం) ప్రభల సుబ్రహ్మణ్యం, వాదితరఫు ప్లీడరు.

---

## బందరు స॥ జడ్జి కోర్టులో

I P. 16/29.

పిటీషనరు,—యలమంచిలి వెంకటసుబ్బయ్య,

And

రెస్పాండెంటు.—వీరమాచనేని రామకృష్ణయ్య (ఋణగ్రస్తుడు)

పైన నమోదుచేసిన రెస్పాండెంటు యీకోర్టు ది 17-1-30 తారీఖున ప్యాసుచేసిన ఆర్డరువల్ల ఇన్సాల్వెంటుగ డిక్లేరు చేయబడినాడు డివిడెండు 1 సంవత్సరము అఫిషియల్ రిసీవరుగారిని రిసీవరుగ యేర్పాటు చేయడ మయినది. క్రెడిటర్లు వారిబాకీలను రూల్సుప్రకారం రిసీవరుగారి యెదుట రుజువు పర్చుకొనవలెను.

సి. వరదరాజులు,
సబార్డినేట్ జడ్జి.




## రాజకీయ నిర్బంధితుల విడుదల

రాజకీయ నిర్బంధితుల విడుదల ఢిల్లీ నాయకుల ప్రకటనలో ముఖ్యముగ పేర్కొనబడెను. దీనికి సర్ సప్రూగారుగూడ సమ్మతించి యుండిరి. జాతీయ పక్షమువారును, హిందూ మహాసభవారును, రౌండుటేబిలు సమావేశమునకు తమ ప్రతినిధులు వెడలుటకు పూర్వము, రాజకీయ నిర్బంధితుల విడుదల జరుగవలయునని యు, తక్షణ అధినివేశ స్వాతంత్ర్యము వాగ్దానము చేయబడవలెనని యు కోరి యుండిరి. వివిధపక్షముల సభలును, రాజకీయ నిర్బంధితుల విముక్తిని కోరియుండెను. కాని, ఇండియా ప్రభుత్వపు హోంమెంబరగు సర్ జేమ్సు క్రేరారు గారు నిన్నటి భారతశాసనసభలో భార్గవగారి ప్రశ్నకు జవాబిచ్చుచు, ఇది జరుగుటకు వీలులేదని తెలిపిరి. కారణ మేమి? సంపూర్ణ స్వాతంత్ర్యము కోరబడుటచేతను, దానిని పొందుటకు శాసనోల్లంఘనము సాధనగ నిర్ణయించుటచేతను, రాజకీయ నిర్బంధితుల విడుదల కిది యనుకూల సమయము గాదని, క్రేరారుగారు బలికిరి. రాజప్రతినిధి ప్రకటనమునకు పిమ్మట, నూతన నిర్బంధములు జరిగలేదని, ఇండియా మంత్రిగా రిటీవల దెలియజేసియున్నను, రాజద్రోహనేరము క్రింద తొమ్మిది కేసులు ప్రారంభింపబడెనని, క్రేరారుగారు అంగీకరించిరి. రాజకీయ నిర్బంధితుల విడుదల దేనికై కోరబడెను? దేశమునందు అనుకూల వాతావరణమును గలిగించుటకే గదా. ఇట్టి కార్యమును జరుపకుండ యనుకూల వాతావరణము లేదని చెప్పిన నేమి ప్రయోజనముండును? ఇట్టి ప్రయత్నము జరిగి, దాని ఫలితమును కనగొనుట అవసరమై యుండెను.

అట్లు జరుగదయ్యెను. ఇకముందు రాజకీయ నిర్బంధితుల విడుదల కట్టి యవకాశము లేదని, క్రేరారుగారి నుడువులు తెలుపుచున్నవి. కాంగ్రెసు సభ పూర్ణ స్వరాజ్య లక్ష్యమును విడువ లేదు. దానిని జేయుటకు శాంతిమార్గముల నవలంబింప గోరకమానదు. కాంగ్రెసుసభ తన సంకల్పమును విడనంతవరకు రాజకీయ నిర్బంధితుల విడుదల జరుగదని స్పష్టమగుచున్నది. క్రేరారుగారి వాక్యములు కాంగ్రెసుసభ్యులను నిరుత్సాహపరచునని తలంచుట వ్యర్థము. అణచివేయుమార్గముగ నిర్బంధములు ప్రజల సంకల్పమును మరింత బలపరచుట నిశ్చయము. పూర్ణస్వరాజ్యదినోత్సవము దేశమందంతటను నిర్విరోధముగ జరుగనందులకు "ఇం-డే మెయిలు" పత్రిక దిగులుపడుచున్నది. ఇటుల జరుగనిచ్చినందులకు భారతదేశాధికారుల నీపత్రిక దూరుచున్నది. అధికారులు [illegible] చెంగాటు లాపక మానకొనవలయునని కోరుచున్నది. ఇక నయినను సమాధాన పద్ధతిని ఇండియా ప్రభుత్వము వారు విడుచుట మేలనియు, అతివాదులను సమాధానపరచుటకు చేసెడి ప్రయత్నములకు వారు అపాయము గల్పించెదరనియు, అందుచే కఠినమార్గమును ప్రభుత్వమువా రవలంబింపవలయుననియు, ఈ పత్రిక ఎచ్చరించుచున్నది. హిందూదేశము నందలి ఆంగ్లో-హైందవ పత్రికలును ఈ పాటకే పాడుచున్నవి. కరాచి డెయిలీగెజెట్టు పత్రిక డాక్టరు సుందరలాలుగారు రచించిన గ్రంథమును నిషేధించినపుడు, అందలో దెలుపబడిన విషయములను మరల ప్రచురించిన కాంగ్రెసు నాయకులను నిర్బంధింపకుండుట పాపమాయని, యడుగుచున్నది.

ముత్తెము మీద, ఈ పత్రికల ఘోషవలన, తీవ్ర నిర్బంధములు చెలరేగునని తలంపవచ్చును. ఇవి పూర్ణస్వరాజ్యోద్యమ వ్యాప్తికి విశేషముగ తోడ్పడును గాని, దానికి అడ్డుపడవని నమ్మ వీలు గలదు. ఢిల్లీ నాయక ప్రకటనములోని నాల్గు షరతులును నిన్నటితో పూర్తిగ నిరాకరింపబడెను. అనుకూల వాతావరణము గలిగించుటకు, సమాధాన పద్ధతి నవలంబించి రాజకీయ నిర్బంధితులను విడుదల చేయవలయునని, ఢిల్లీ ప్రకటనము గోరియుండెను. ఈ కోరిక నిరాకరింపబడెను. కామన్సుసభలో ఇండియా మంత్రిగారు కూడ రాజకీయ నిర్బంధితుల విడుదల జరుగునని సూచించిరి. కాని, వారి వాగ్దానము నిష్ఫలమయ్యెను. రౌండుటేబిలు సమావేశమునందు కాంగ్రెసు ప్రాతినిధ్య మనేకముగ నుండవలెనను షరతు దాని యంతట యదియే యంతరించెను. కాంగ్రెసు పక్ష మీనియందు పాల్గొనుట లేదు గాన ఈ ప్రశ్న యుదయింపదు. అధినివేశ గోరెడి రాజకీయ పక్షమున కయినను అధిక ప్రాబల్యము చేకూరునను నాశ గనుపింపదు. వివిధ మత రాజకీయ పక్షములకు ప్రాతినిధ్య మేర్పడునని, రాజప్రతినిధిగారి ప్రసంగము బట్టి గ్రహింపవచ్చును. తక్షణ అధినివేశస్వాతంత్ర్య ప్రదానమునకు రౌండుటేబిలు సమావేశము తోడ్పడునని గాని, అందకు సంబంధించిన విధానమును తయారుజేయునని గాని తలంప వీలులేకుండ, రాజప్రతినిధి ప్రసంగము తేటపరచగలిగెను.

అందుచే నాల్గు షరతులును పూర్తిగ నిరాకరింపబడినటుల ఎంచవచ్చును. కాంగ్రెసు పక్షవారు పూర్ణస్వరాజ్యము గోరుచున్నను, తక్షణ అధినివేశ స్వాతంత్ర్యము గోరుచున్న ఇతర పక్షములవారికైనను ఈ షరతులు నిరాకరింపబడిన హేతువుచే, రౌండుటేబిలు సమావేశమును బహిష్కరించుట యవసరము గాదా? ఢిల్లీ ప్రకటనముపై సంతకము జేసిన సప్రూగారి కింతకన్నను వేరు మార్గము లేదు. ఆత్మగౌరవ రక్షణకిది యవసరము. కాని, వారే [illegible] నయినను రౌండుటేబిలు సమావేశమునకు వెడలవలయు ననుచో, వారిని నిరోధించువా రుండరు. సప్రూగారితో నేకీభవింపక ఢిల్లీ షరతులు ముఖ్యమని పట్టుబడి జాతీయ పక్షమువా రయినను, రౌండుటేబిలు సమావేశమును బహిష్కరించి, తమ గౌరవమును కాపాడుకొనుట యవసరము. ఏ రీతుల మెలగినను, కాంగ్రెసు సభ్యులు కాంగ్రెసు నిర్ణయములను శ్రద్ధతో నిర్వహించి, సత్వరస్వరాజ్యసిద్ధికి తోడ్పడుట యావశ్యకము. నిర్బంధములు వారి నిశ్చయమును మరలింప జాలవు. ఎట్టి విషమపరిస్థితులలో నయినను, వీరు అహింసాపథమును మాత్రము విడువజనదు. ఈ రీతిన, మహాత్ముని యూదేశము ననుసరించి, కాంగ్రెసు లక్షలను దేశము నిర్వహించుచో, నేడు దేశము నావరించిన నిరోధము లన్నియు, స్వాతంత్ర్యభానుని ముందర మంచువలె కరుగక మానవు. అందుచే, నిరుత్సాహమున కవకాశము లేదు. దేశస్వేచ్ఛ ప్రజాశక్తిపైననే ఆధారపడుట నిశ్చయము గాన, ప్రజలు తమ పట్టుదలను విడువనిచో, విజయము ధ్రువమని నమ్మవచ్చును.

## ప్రత్యేక నియోజకవర్గములు

సామాన్య నియోజక వర్గములు స్థానిక స్వపరిపాలన సంఘములం దయినను పర్పడనిచో, జాతీయ సఖ్యము బలపడుటకు మార్గము గనుపింపదు. స్వప్రయోజనము నిమిత్తమై యూరపియను సభ్యులు ప్రత్యేక నియోజక వర్గములను కోరుచు, అవి పటిష్ఠ మయినను దొలగకుండుటకు, విశ్వప్రయత్నముల గావించుచున్నారు. ఇతర అల్పసంఖ్యాక సంఘములను వీరిందుకై పురికొల్పుచున్నారు. యూరపియను ప్రతినిధియగు కల్నల్ క్రాఫర్డుగారు భారతశాసనసభలో అల్ప సంఖ్యాక సంఘములకు ప్రత్యేకముగ నేర్పరుప సమ్మతించుచున్నారని నేటివార్తలు దెలుపుచున్నవి. ఆంగ్లో హైందవులను, దేశీయ క్రైస్తవులను, మహమ్మదీయులను మున్నగువారిని, వీరు నూతనసంఘమున జేర్ప సమ్మతించుచున్నారు. ఇంగ్లండులో సామాన్య నియోజకవర్గములే ప్రబలియున్నను, బ్రిటీషు ప్రముఖులు హిందూదేశమునందు ప్రత్యేక నియోజక వర్గముల నేర్పరుప జూచుటకు స్వార్థపరత్వమువక వేరు కారణము గనుపింపదు. ఏ దేశమునందయినను, అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకుల యిష్టమునకు లోబడుట సామాన్యధర్మముగ నెంచబడుచున్నది. హిందూదేశమునందు మాత్రము అల్ప సంఖ్యాక సంఘములు అధిక సంఖ్యాక సంఘములపై తిరుగబడి వారి పలుకుబడిని నశింపజేయుట యవసరమని దెల్పువారు గలరు. వీరిలో యూరపియను ప్రతినిధులు ముఖ్యులు. ప్రజా పరిపాలన సూత్రములకు విరుద్ధముగ వీరిటుల పురికొల్పుచున్నారు. హైందవ క్రైస్తవులలో పలువురు సామాన్య నియోజకవర్గములను గోరుచున్నను, వారిని గూడ వేరుజేయుటకు, కల్నల్ క్రాఫర్డుగారు ప్రయత్నించుచున్నారు. ఇంతకు పూర్వము జిల్లా మ్యునిసిపాలిటీల సవరణ చట్టము మదరాసు శాసనసభలో విచారణకు వచ్చినపుడు, సామాన్య నియోజకవర్గ స్థానమున ప్రత్యేక నియోజకవర్గములను నెలకొల్పవలయునని, యూరపియను సభ్యులు పట్టుబట్టిరి. కాని, ప్రధాన మంత్రిగా రిట్టి విపత్తును నివారింపగలిగిరి. మరల లోకలు బోర్డుల సవరణ చట్టము విచారణకు వచ్చిన సమయమున గూడ యూరపియను సభ్యులిట్టి ఎత్తులనే అవలంబించిరి. ఉద్ధుగారి సవరణ ప్రత్యేక నియోజకవర్గములను స్థాపింపగోరెను. దీని సవరణ కొన్ని మైనారిటీ సంఘముల కుత్సాహమును పురికొల్పెను. కాని, ప్రధాన మంత్రిగారీ సవరణను పూర్తిగ నిరసించి, ఓడింపగలిగిరి. జస్టిసు పక్ష నాయకులగు డెబి. మునిస్వామి నాయుడుగారు కూడ సవరణకు ప్రతికూలముగ ముచ్చటించి ప్రధానమంత్రిగారితో చేతులు గల్పియుండుట సమ్మోదావహము. సర్ పాత్రోగారు మాత్రము వుద్ధుగారి సవరణ నామోదించిరి. శ్రీ

లకు గూడ ప్రత్యేకప్రతియోజకవర్గములు కావలెనని, వృద్ధుగారి సవరణ గోరినను గాని, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు మాత్రము స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గ మక్కఱలేదనియు, సంయుక్త నియోజకవర్గములోనే స్త్రీల హక్కులు సురక్షితముగ నుండుట కవకాశ మనేకముగ గలదనియు, సహేతుకముగ నిరూపించిరి. ఎట్టులయిన నేమి, వృద్ధుగారి ప్రయత్నములు విఫలమయ్యెను. శాసనసభా సభ్యుల పీటికి తోడ్పడిరి గాని, ప్రయోజనము లేకపోయెను. దేశాభివృద్ధికిని, జాతీయభావ వ్యాప్తికిని అడ్డుపడుచున్న యీ మతపరమగు ప్రతినిధుల ప్రవర్తనమెంత నింద్యమో యూహింపవచ్చును.

నూతనచట్టములు

ఈ వారపు ఫోర్టుసెంటు జార్జిగెజెట్టులో, కొన్ని నూతనచట్టములు ప్రచురింపబడినవి. సాల్డానాగారు ప్రతిపాదింప దలచిన, పరిశ్రమల సహాయచట్టపు సవరణ ముఖ్యమయినదిగ దోచును. పరిశ్రమల బోర్డునందు ప్రభుత్వ కార్యదర్శి సభ్యముగ నుండ గూడదని, సవరణ చట్టము గోరుచున్నది. ప్రభుత్వమువారు పరిశ్రమల కిచ్చెడి ఋణములను, మిగిలిన ఋణములకన్న ముందుగ రాబట్టుట కిపుడు వీలు గలదు. ఇట్టి యవకాశ ముండ గూడదనియు, ప్రభుత్వపు ఋణములకు ఇతర ఋణములకన్న యాధిక్యముండ గూడదనియు, సాల్డానా గారు గోరుచున్నారు. వంశపారంపర్యపు గ్రామోద్యోగుల చట్టమునందు రంగనాథ మొదలిగారు సవరణను ప్రవేశపెట్టదలచిరి. గ్రామోద్యోగమునకు హానికరముగ ప్రకటింపబడిన సాంసర్గు చనిపోవుటతటస్థించినచో గాని ఇతర విధముల ఖాళీ యేర్పడినచో గాని వారి స్థాన మాక్రమించుటకు కోరిన హైసరును రిజిష్టరు చేయుటకు వీలుండవలయు ననినూతనచట్టముగోరుచున్నది రెండవవారైనను రిజిష్టరుచేయుటకు వీలు లేదని,రివిన్యూ యుద్యోగులు భావించుటచే, వీరీ చట్టమును దెచ్చుట తటస్థించినది. హిందూ దేవాలయములలో దేవదాసీల పద్ధతిని బొత్తిగ మాన్పించు నుద్దేశ్యముతో డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగా రొకచట్టమును ప్రవేశపెట్టెదరు. ఈనాముల ననుభవించు దేవదాసీలేగాక ఇతర దేవదాసీలు గూడ దేవాలయములకు కన్యల నర్పించుచున్నారనియు, యిటుల నర్పింపబడు కన్యలు మరల వివాహమాడుటకు వీలుండవలెనియు, దేవదాసీ పద్ధతి మొదట నెట్టి యుద్దేశ్యముతో ప్రారంభింపబడినను, యిప్పుడు వ్యభిచారము నిమిత్తము మాత్రమే యిది యుపయోగపడుచున్నదనియు, అందుచే దీనిని పూర్తిగ తొలగింప నవసరము గలదనియు, మైసూరు ప్రభుత్వమువారు దేవదాసీ పద్ధతిని నిషేధించుచు 1910 సంవత్సరమున శాసనము గావించియుండిరనియు, బ్రిటీషు ప్రభుత్వమువారు గూడ ఈ మార్గము నవలంబించుట యవసరమనియు, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు చట్టపు కారణోద్దేశ్యములందు దెల్పదలచిరి. దేవదాసీ సంఘమువారు పలువు రిట్టి చట్టమును చేవలసినదని తమను గోరిరని కూడ ఈమె దెలిపెను. ముత్తులక్ష్మి రెడ్డిగారి చట్టము శాసనసభవారిచే నంగీకరింపబడి వ్యభిచారవృత్తికి ప్రోత్సాహమొసగుచున్న దేవదాసీపద్ధతిని పూర్తిగ తొలగించు నని నమ్మెదము.

పటేలుగారు : ఇండియా ప్రభుత్వము

ఇండియా ప్రభుత్వమువారికిని, పటేలుగారికిని మధ్య జరిగిన భేదము లింకను పరిష్కారమును గాలేదు. 'ప్రతిష్టంభన' మింకను నిలచియే యున్నది. శాంత శాసనసభా మందిరమునందలి గ్యాలరీలు ప్రజలు స్వేచ్ఛగ ప్రవేశించు ప్రదేశములా? అధ్యక్షుని ఇచ్ఛకు విరుద్ధముగ గ్యాలరీలలో పోలీసు వారిని నెలకొల్పుటకు ప్రభుత్వమున కధికారము గలదా? ఈ రెండు ప్రశ్నల విషయమై అధ్యక్షునికిని, ప్రభుత్వమువారికిని దాటరాని భేదము లున్నటుల గనుపించును. వివిధపక్షనాయకులు, సమాధాన ప్రయత్నములు గావించుచున్నారు. పటేలుగారి యభిప్రాయము హౌసుకమిటీవారి రిపోర్టు కనుగుణముగ నున్నది. పటేలుగారి యభీష్టమును నెగ్గనిచో, వారు తమ పదవికి రాజీనామా నిచ్చి బయల్వెడలుట దప్ప వేఱుమార్గము లేదు. రాజప్రతినిధిగారొక్కరే ఏమియు జేయజాలరనియు, ఇండియా ప్రభుత్వమంతయు గలిసి యోచింపవలయుననియు, యిటీవల బయల్పడెను. ఇండియా ప్రభుత్వమువారు క్రేరారుగారి చర్యను సమర్థించుట సహజము. అప్పర్వాయి పత్రికకు డిల్లీ విలేఖకుడు వ్రాయుచు పటేలుగారి నేదోవిధముగ నయినను స్థానభ్రష్టుల గావింపవలయునని, ఇండియా ప్రభుత్వము వారు నిశ్చయించినటుల సూచించెను. ఈ వార్త నిజమగునో, ప్రభుత్వ సంకల్పము సులభముగ నెరవేఱకమానదు, పటేలుగారు త్వరలో రాజీనామా నిచ్చుట జరిగి తీరును.

కామన్సుసభ : స్వేచ్ఛాసామ్రాజ్యవాణిజ్యము

బ్రిటీషు సామ్రాజ్యమునందు స్వేచ్ఛా వాణిజ్యము జరుగవలెననియు, సామ్రాజ్యము వెలుపలి సరకులపై సుంకములను విధింపవలయు ననియు, కన్సర్వేటివు ముఖ్యులు కొంత కాలమునుండియు వాదము సలుపుచుండిరి. ఈ పద్ధతివలన, హిందూదేశమున కెంతనష్టము గలదో, యింతకు పూర్వము వివరించి యుంటిమి. ఇందుమూలమున హిందూదేశము తనకు చౌకగ లభించుచోటుల సరకులను కొనుటకుగాని, తనకు ధరవచ్చినచోటికే సరకులను పంపుటకుగాని వీలుండదు. సామ్రాజ్యాభిమానము పేరుతో,హిందూదేశ మన్ని విధముల నష్టపడవలసి వచ్చును. హిందూదేశమునకు అధినివేశస్వాతంత్ర్యమిచ్చుట కంగీకరింపని, కన్సర్వేటివు ప్రముఖులు హిందూదేశము వాణిజ్యవిషయమున సామ్రాజ్యాభిమానము జూపవలయు నని కోరుట యెంత హాస్యాస్పదమో యూహింపవచ్చును. రీడింగుగారు స్వేచ్ఛాసామ్రాజ్య వాణిజ్య తీర్మానమును నిన్నటిదినము కామన్సుసభలో ప్రతిపాదించిరి బాయాముబాల్డ్విను గారిదివరకీ పద్ధతికి ప్రతికూలు రయినను,చాలవరకామోదము జూపిరి. స్నోడనుగారు ప్రభుత్వము తరపున ఈ తీర్మానము నెదిర్చిరి. తుదకు చర్చ విరమింపబడెను. ప్రస్తుతసమయమునం దీ సిద్ధాంతము విశేషవ్యాప్తి గాంచక పోయినను, త్వరలో దీని వ్యాపింపజేయుటకును, సామ్రాజ్యముపై దీని నేలీరున నయినను బొప్పించుటకును ప్రయత్నములు జరుగు నని నమ్మవచ్చును.

స్థానికసంఘములు : కలెక్టరులు

స్థానిక స్వపరిపాలనసంఘములు స్వేచ్ఛ బడయవలయుననిన, అధికారులవశము దొలగిపోవలయును. ప్రస్తుతసమయమున, స్థానిక స్వపరిపాలనము స్థానికమనుగాక, స్వపరిపాలనము గాక, నేతిబీరకాయ పోలియున్నది. ఆర్థిక స్వాతంత్ర్యమును పరిపాలనాస్వాతంత్ర్యము గూడ ఈ సంఘములకు లేకయున్నవి. కలెక్టరులు, స్థానికసంఘముల తీర్మానములను ఇచ్ఛవచ్చినపుడు నిరాకరింప వీలుగలదు. ఇట్టి నిరంకుశాధికారమును తొలగింపవలయునని, మ్యునిసిపలు చట్టపు సెలెక్టుకమిటీవారును, లోకలు బోర్డుల చట్టపు సెలెక్టుకమిటీవారును గూడ గోరియుండిరి కాని ప్రధానమంత్రిగారు కలెక్టరుల యధికారమును స్థాపింపగోరుట జూడ, వీరికి స్థానికసంఘముల స్వాతంత్ర్యము పట్ల నెంత విముఖత గలదో యూహింపవచ్చును. మ్యునిసిపలు చట్టమునందు, కలెక్టరు అధికారము పునరుద్ధరింపబడెను. లోకలు బోర్డుల చట్టమునందుగూడ కలెక్టరుల అధికారమును తొలగింపగూడదని, ప్రధానమంత్రిగారు దెచ్చిన సవరణ నెగ్గెను. ఈ సవరణవలన, లోకలు బోర్డుల మ్యునిసిపలు సంఘముల దుస్థితి ఏమాత్రము తొలగదని స్పష్టమగుచున్నది.

రంగుభేదము

ఇంగ్లండులో గూడ రంగుభేదము రానురాను ప్రబలమగుచున్నది. అమెరికవాయువులు ఇంగ్లండునందుగూడ వీచినటుల దోచును. ఈ విషయమై మిస్ బెల్లమీగారు మెరీ రాణిగారికి వ్రాసినటుల దెలియుచున్నది. చేరువున నున్న ఫ్రాన్సులో వర్ణభేదమంతగ గనుపించుటలేదు. బ్రిటీషు సామ్రాజ్యమందు, అధిక సంఖ్యాకులు రంగుజాతులవారగుటచే, రంగుభేదమును బ్రిటీషువారు పాటించుటవలన, బ్రిటీషు సామ్రాజ్యమునకు తీరని నష్టము గలుగుట సహజము. ఇంతకుపూర్వము, పార్లమెంటుసభ్య లొకరు నీగ్రోజాతివారిపై జూపబడిన ద్వేషమును గూర్చి లేవదీయ ప్రభుత్వమునకు తెలుపగ, తామేమియు జోక్యము దీసికొనజాలమని వారు జవాబిచ్చిరి. ఈ మారయినను అనుకూలఫలము గలుగునేమో చూడవలయును.

సేనగుప్తగారు

సేనగుప్తగా రస్వస్థదేహులై, కొంతకాలము నుండియు బాధ నొందుచున్నారు. వైద్యులసలహాపైని వీరు ఆరోగ్యమునిమిత్తము సింగపూరము వెడలదలచిరి. కాని, సుభాష చంద్రబోసు ప్రభృతుల నిర్బంధము జరుగుటచే, వారు తమ ప్రయత్నమును మానివైచిరి. రేపటిదినము వీరు పతివమేతులై సింగపురమునకు వెడలెదరని, తెలియుచున్నది. వీరు స్వస్థదేహులై త్వరలో మాతృసేవ జేయునటుల పరమేశ్వరు డనుగ్రహించుగాక యని కోరెదము. సేనగుప్తగారి నాయకత్వ మీ సమయమున వంగదేశమున కత్యవసరము. అందుచే వీరు నాయకత్వభారమును త్వరలో వహింతురుగాక యని కోరెదము.

# విదేశవార్తలు

## నిప్పుతో చెలగాటము

స్వాతంత్ర్యవాదులను అణచివేయవలెను

బ్రిటిషు పత్రికల సూచనలు

(బీముసర్వీసు)

లండను, జనవరి 28 — భారతదేశమునందలి స్వాతంత్ర్యోద్యమములకు సంబంధించిన విషయములను ప్రకటించుచు సన్‌డే డిస్పాచ్ పత్రిక ఇట్లు వ్రాయుచున్నది — భారతదేశమునందలి స్వాతంత్ర్యోద్యోగులను నిరోధించక యూరకుండుట నిప్పుతో చెలగాటము చేయుట యగుచున్నది ప్రభుత్వము వారు శాంతమును విడనాడి కఠినమైన ఈ ఉద్యమమును అణచివేయుదురని నమ్ముచున్నాము.

సండే క్రైమ్సుపత్రిక ఇట్లు వ్రాయుచున్నది — ఇండియా ప్రభుత్వమువారు సామోపాయములను విడనాడి కఠినముగ ప్రవర్తింపవలసిన సమయము వచ్చినది. భారతదేశమునందలి అతివాదులను మన మెత్తటికి తృప్తిపరుపజాలము. సామోపాయములను అవలంబించినప్పుడెల్ల ప్రభుత్వమువారు దుర్బలులనియు లొంగిపోవుచున్నారనియు అతివాదులు తలచుచున్నారు. ప్రభుత్వమువారు కఠినవిధానము నవలంబించుట శ్లాఘ్యము.

## పటేలుగారిని ఉద్యోగమునుండి తొలగించవలెను

ఇంకను ప్రభుత్వమువారి పట్టుదల

కార్మికప్రభుత్వమువారిందుకు అంగీకరించెదరా?

లండను, జనవరి 28 — అబ్జర్వరు పత్రిక డిల్లీ విలేఖరుడు ఆ పత్రికకు ఇట్లు వ్రాయుచున్నాడు — అసెంబ్లీ గ్యాలరీలయందు పోలీసు బందోబస్తు నుంచు విషయమై అధ్యక్షులగు పటేలుగారికిని ఇండియా ప్రభుత్వమువారికిని సంఘర్షణ మేర్పడినది. పటేలుగారిని అధ్యక్షపదవినుండి తొలగింపవలయునని ఇండియా ప్రభుత్వమువారు సంకల్పించుకొనియున్నారు కాని కాంగ్రెసువారు రెండు బిలులు సమావేశమును నిరాకరించుటచే ఇప్పటికే విషమపరిస్థితి ఉదయించినది. మరల పటేలుగారిని ఉద్యోగమునుండి తీసివేయు ఏర్పాటును కార్మిక ప్రభుత్వమువారు అంగీకరించుట అసంభవము.

## ఇంగ్లండులో భారతీయులను నిషేధించుట

ఈవిషయమును చక్రవర్తినికి

బెల్లామీ కన్య దెలుపుట

(బీము సర్వీసు)

లండను, జనవరి 28 — ఇంగ్లండులో భారతీయులను శ్వేతముఖులు ఒక్కరకు రానీయకున్నారని బెల్లామి కన్య చక్రవర్తినికి తిన్నగా ప్రవర్తనిపేర వ్రాసెను. టాపారు కలాపాంపు టంగనకి బెల్లామీ కన్యయు ఒక భారత వైద్యుడు గుడు హాగారను స్పృశ్యమాకు పోయినట. బెల్లామిని మాత్రము గొప్పనక హాగారిని రంగభేదముచే భాగస్థుగ అతెతో వచ్చుటకు వీలులేదనిరి తన అవమానమును దెలుపుచు బెల్లామి కన్య చక్రవర్తి కీసంగతిని దెలిపెను జేటియు ప్రభుత్వశాఖవారీసంగతిని విచారించుచున్నారని తెలియుచున్నది. ఈ సందర్భమున ఇంగ్లండు ఫ్రాంసులలో భారతీయులను అంగీకరించు పద్ధతిని కైకొన్నపుడును కట్టించవలసి యున్నది.

రంగుభేదముచే ఆఫ్రికా వాసులకు ఫలహారములకు పట్టించనిచో లైసెన్సును తీసివేసెదనని అంగడివారిని బెదరించెను. ఒకవారి కౌపీన్యుడు నీగ్రోను ఒకరిని లండనులో హోటళ్లలోనికి రానీయలేదు దానిని గూర్చి పార్లమెంటు సభ్యుడగు మార్లీగారు కార్మిక ప్రధానామాత్యునకు దెలుప అట్టివారలకు వారి సేవచేయుటకు వీలులేదనియు హోటళ్లకు రానిచ్చుటకు హోటళ్ల యజమానుల ఇష్టమని ప్రత్యుత్తర మిచ్చిరట.

## సామ్రాజ్య స్వేచ్ఛావ్యాపారము

పార్లమెంటులో చర్చ

(వైర్లెస్)

లండను, జన 29: — కామన్సుసభలో సామ్రాజ్య స్వేచ్ఛావ్యాపారమును గూర్చి చర్చించిరి. సామ్రాజ్యములో స్వేచ్ఛావ్యాపారమును అవిర్భముగా జేసికొని సామ్రాజ్యములో తయారుకేసిన సరకులనే కొనుటకు సామ్రాజ్యములో నున్న ఇతర ప్రభుత్వములతో రాయబారములను సలుపవలెనని యీ కన్సర్వేటివు ప్రయివేటు సభ్యుడు రీమరు తీర్మానము నుపపాదించెను మనకు ఆహారపదార్థములు ప్రియముగనని చేయు అందోళనమున కెంతమాత్రము భయపడనవసరము గాదు. అది నిజమునకు కాదనీ వానన్మరము ప్రజలకు స్వల్పమాత్రము లనోభ్యను లగనివ్వదు కంటె ప్రజలకు శాశ్వతముకు క్షేమోపాధి కలుగ కేసినవారమగుదుమనిరి

పిమ్మట నంతరమున పోమినియను అధికారసభ్యుడు పద్యకమును బలపరచుచు లాయిడ్ జార్జిగారనిరి కాని అసలు పరీక్ష పేదవగారినికి ప్రతికూలముగ వారలకు మనము చేయునదేమనిరి. సామ్రాజ్యములోనికి దిగుమతియగు ఆహార పదార్థములపై అవసర పన్నును వేయువారము గామని తీర్పునిలెనము సవరణను లాయిడ్ జార్జిగారు దెలిపిరి. ముడిసరుకువులమీద అవసర పన్నును విధించువారము కామని వరకు చేయవలెననిరి.

ఈ విషయమై పూర్వము కన్సర్వేటివు ప్రభుత్వమునందున్న సభ్యులిప్పుడు మాట్లాడకుండుట విచారకరమని స్నోడనుగారనిరి. విదేశములనుండి వచ్చు ఆహారపదార్థముల మీదను ముడివస్తువులమీదను చేరి వస్తువులమీదను పన్నును విధించిన ధరలు హెచ్చునని ఇపుడు మాట్లాడిన ఇద్దరిసభ్యుల ధోరణినిబట్టి తెలియుచున్నది అట్టి ఏర్పాటులను ప్రభుత్వమువారెంతమాత్రము అంగీకరింపరని స్నోడనుగారు తెలిపిరి. సభ్యులు గోరినటుల సామ్రాజ్యవర్తకమును పెంపొందు చేయవలెననే ప్రభుత్వమువారి కోరికగూడ మూన్యదేశముతో సామంతరాజ్యములు ప్రేమతో యుండుటకు కార్మికప్రభుత్వమువారు చేయవలసిన దానినంతయు చేయుచున్నారు ఇంకను చేసెదరు.

కాని తీర్మానములో దాగియున్న యర్థము ప్రకారము ప్రభుత్వమువారు అట్టి విధానము నెంతమాత్రము ఆమోదింపరని స్నోడనుగారు దెలిపిరి.

ఈ తీర్మానమును అంగీకరించినచో పన్నులను గూడ ఒప్పుకొన్నటులే యగుననిరి. ఆహార పదార్థములమీద పన్నును విధించుటకు ఒప్పుకొనెదరన్న మాటనిరి. చర్చ అయిపోయ బడెను.

## స్పెయిను ప్రభుత్వము

(రూటరు)

మాడ్రిడ్, జనవరి 30 — సైన్యంగుపు ప్రభుత్వము రాజభక్తిప్రమాణమును నేటి మధ్యాహ్నము స్వీకరించెదరట. ఎట్టి అల్లరులను సహింపమని సైన్యంగురుగారు తెలియజేసిరి ముఖ్యముగ విశ్వాసపాలనపు సభ్యులపై తిరుగబడిన ఎంతమాత్రము సహించువారముగామనిరి తాత్కాలికముగ శేఖాపరిశీలనము ను తీవ్రముగ సాగించెదమనిరి.

## స్పెయినులో అశాంతి

(రూటరు)

మాడ్రిడ్, జనవరి 30 — రాత్రి అంతయు వీధులంట చాల ప్రదర్శనము గడ్డెను. విద్యార్థులు మిత్వ్యాపారము నంతరింపజేయవలె నసుచు ఊరేగిరి. పోలీసువారు విద్యార్థులను డీకొని ఎస్ డిబేటు అను వార్తాపత్రికా కార్యాలయమును విద్యార్థులు తగులబెట్టిరి ఫలహారపుటంగడుల కిటికీలను బద్దలగొట్టిరి నగరమునందున్న క్లబ్బు కిటికీలను బద్దలగొట్టిరి బార్సిలోనాలో గూడ ఇటులే జరిగెను. వేరుపాకలను పయోగించి అరుగుడుకు తగాద్రుంగెను. పనివాండ్రు విద్యార్థులతో గూడిరి. ప్రత్యేకపు పోలీసుదళము ఆయుధపాణులై పోలీసుకు తోడ్పడుచున్నారు.

తూర్పు ఆఫ్రికా తీరమునకు తూర్పుఇంజినును నాగాడకము పోవుట మానెను.

భారతవైమానికుడు మనమోహనసింగుగారు మధ్యాహ్నము 12-45 గంటలకు స్పెయిను బయలుదేరెను.

## రెడ్‌క్రేడ్ యూనియను కేంద్రసంఘ తీర్మానము

(రూటరు)

రీగా, జన 29 — ఆస్ట్రేలియా, ఇండియా, దక్షిణ ఆఫ్రికా ఫిలిప్పైన్సు కూబా, పెరూలలో సమ్మెలను విప్లవ తిరుగుబాటులను గావించి వాటికి డబ్బు నిచ్చుటకు అంతర్జాతీయ నిధి చేర్పవలెననియు విప్లవోద్యమమును సాగించుటకు పనిలేనివారిని ఉపయోగించవలెననియు విదేశములందు త్వరితముగా విప్లవమును ఏర్పాటు చేయుటకు ప్రయత్నించవలెనని రెడ్‌క్రేడ్ యూనియను కేంద్రసంఘము వారు తీర్మానించిరి.

## నౌకావళి నిర్ణయసభ

(వైర్లెస్)

లండను, జనవరి 29 — సభాప్రారంభమున అధ్యక్షులగు మెక్డొనాల్డుగారు సంగ్రహముగ నుపన్యసించెను. ప్రతినిధులు తమ తమ అభిప్రాయములను దెలుపుటకు తరగతివారిగ ఆయా ప్రభుత్వములు తగ్గించు పంతుప్రకారము బ్రిటిషు చేయునట. కేవల సభాకార్యక్రమము నెట్లు జరుపుగది నిర్ణయించుట కొక ఉపసంఘమును నియమించెదరు.

ఈసంఘములో ఒక్కొక ప్రతినిధిసంఘమునుండి ఇద్దరు ప్రతినిధులుందురట కేటియింగ్ మున బ్రిటిషు ప్రతినిధులు మామూలుమంత్రి హెండర్సనగారు.

ఈ సభాఫలితము లెటులుండునో యని హెండర్సనుగారనిరి స్విట్జర్లండు జనీవా ప్రారంభ అయుధ విసర్జనసభ జరుగుట కవకాశము రాదనిరి. కాని విఫలమగునని నేనొప్పుకొనను. ఆ భావముతో సభ పనిచేయుననిరి. ఆ దురేశకే సర్వమంత్రినని హెండర్సనుగారనిరి.

ప్రభుత్వమువారికి ఆర్థికవిషయములందు సలహానిచ్చుటకు ఆర్థిక విచారణసంఘమును నియమించెదరు, పారిశ్రామికవర్గాభివృద్ధికి పాటుపడెదరు.

జడ్సీలో లక్షణములను దీయుటకు పలస్తీను పోలీసు కంపెనీకి లైసెన్సు నిచ్చిరి.

## కుంభమేళ జయప్రదముగా ముగియుట

40 లక్షలప్రజలు త్రివేణిలో స్నానముచేయుటకు వచ్చుట

అలహాబాదు, జనవరి 29 — ఈరోజు అమావాస్యయగుట వలన పావనత్రివేణీ సంగమమున స్నానమాడుటకు అన్నిరోజుల కంటె హెచ్చుమంది వచ్చిరి దాదాపు 6 లక్షలప్రజలు వచ్చియుందురు, ఉత్సవములు, ఊరేగింపు లన్నియు యిబ్బందిలేక జరుపబడెను. స్నానములు ముగియునప్పటికి రాత్రి చాల ప్రొద్దుపోయినది. (అ. ప్రెస్.)

అలహాబాదు, జనవరి 30 — రాత్రి చాల ప్రొద్దుపోవువరకు, ఈరోజు ఉదయము కుంభమేళలో స్నానములు సాగెను. స్నానము చేసినవారిసంఖ్య యింతమందియనిగాని నిర్ణయించుటకు వీలులేకున్నది. దాదాపు 40 లక్షలమంది యుందురని ఒకరు అంచనా వేయుచున్నారు. ఒక ఏనుగు మదించి ప్రజలమీద పడగా కొందరికి గాయములు తగిలెను.

జనసమూహమును నడ్డుచుండగా సెయిలిస్టు, ఐ. సి. యస్. గారికి లాఠీ దెబ్బ తగిలెనని తెలియుచున్నది. చాలమంది ప్రజలు కనబడలేదని పోలీసులకు తెలియపరుపబడినది. అధికారులు, నివాసమిత్రులు, యితర ప్రజాసేవక ప్రతిష్ఠానములు అన్నియు కలసి మంచిసేవ చేసినది. ఎక్కడో కొన్ని చిన్న ప్రమాదములు తప్ప నీసారి కుంభమేళ 1918 సంవత్సరమున జరిగిన కుంభమేళవలె జయప్రదముగా జరిగినదియును. (అ. ప్రె)

## బ్రహ్మసమాజ శతవార్షికోత్సవము

## మాధవరం

ఈ నెల 22-వ తేది వుదయం 8 గంటలకు ప్రార్థన సమాజహాలులో ఈశ్వరోపాసన తమ్మిశెట్టి పిచ్చయ్య గారిచే జరుపబడెను మానవుడు పొందవలసిన యథార్థ విశ్వాసమునుగురించి మాట్లాడినపిమ్మట బాలికా పాఠశాలలో బాలికలచే కొన్నికీర్తనలు పాడించి తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు భక్తినిగురించియు, ప్రేమనుగురించియు బాలికలకు చెప్పిరి.

మధ్యాహ్నం 4 గంటలకు బాలురపాఠశాలలో బసివిల్లలచే ప్రార్థన చేయించి తల్లాప్రగడ నారాయణమూర్తిగారు బాలురకు సత్యము మంచినడవడిక యిప్పటినుండియు నేర్చుకొనవలసియున్నదని బాలురకు బోధించిరి బాలబాలికలకు ఫలహారము లొసగబడెను.

రాత్రి 8 గంటలకు రామలింగస్వామి కోవెలలో తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారి అధిపత్యమున బహిరంగసభ జరుపబడెను. అధ్యక్షులు బ్రహ్మధర్మమునుగురించి రాజా రామమోహనరాయ చేసిన సేవనుగురించి మాట్లాడిరి తరువాత మతంగూడెం గ్రామకాపురస్థులు, బాల సీతారత్నమ్మగారు అహింసను గురించియు, భక్తినిగురించియు దీర్ఘముగ నుపన్యసించిరి.

23-1-30 వ తేదిని వుదయం 4 గంటలకు నగరసంకీర్తన జరుపబడిన తరువాత 8 గంటలకు ప్రార్థనసమాజ హాలులో తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారిచే ఈశ్వరోపాసన జరుపబడెను. అమెరికాదేశభక్తుడగు టాల్‌స్టాయి దొరగారి జీవితములో కనిపెట్టిన మహాశయుని యొక్క ప్రవర్తనను గురించి తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు మాట్లాడిరి.

మధ్యాహ్నం 2 గంటలకు బాలసీతారత్నమ్మగారి అధిపత్యమున స్త్రీలకు బహిరంగసభ ప్రార్థనసమాజములో జరుపబడెను ప్రసిడెంటుగారిచే బ్రహ్మధర్మము, అహింస, భక్తి, నడవడిక, నీతినిగురించి స్త్రీలకు వుపన్యాసములు గావింపబడెను 4 గంటలకు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి అధిపత్యమున బోర్డుస్కూలు విద్యాలయములో నొక బహిరంగసభ జరుపబడెను. సభకు వచ్చినవారిలో తల్లాప్రగడ నరసింహశర్మగారు, తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు, తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, తల్లాప్రగడ నారాయణమూర్తిగారు గలరు అధ్యక్షులు బ్రహ్మధర్మము దాని ఆదర్శమును గురించి విపులముగా మనకు లుపయోగకరమగు నుపన్యసించిరి రాజా రామమోహనునియొక్క జీవితచరిత్రముగురించి తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు మాట్లాడిరి బాల సీతారత్నమ్మగారు అహింసనుగూర్చి గొన్ని పద్యములు చదివి వుపన్యాసము గావించెను అధ్యక్షులకు వందనములతో సభ చాలింపబడెను పైసభకు ఇతర గ్రామములనుంచి కొంతమంది వచ్చిరి. (పురవాసి)



## నిఖిల భారత ఆయుర్వేద విద్యాపీఠపరీక్షలు 1930

బెజవాడ కేంద్రము

ఈసంవత్సరము మార్చి 24 వ తేదినుంచి పైవిద్యాపీఠము వారి ఆయుర్వేదపరీక్షలు శ్రీవేంకటేశ్వర ఆయుర్వేదకళాశాలా భవనమున జరుగును.

ఈపరీక్షలకు పోవువారలందరును ఫిబ్రవరి 15 తేదిలోపుగనే దేశసట్లుల "సెక్రటరీనిఖిలభారత ఆయుర్వేద విద్యాపీఠము వరయాగంజ్ కాశి వ్యాపారి" అను అడ్రసుకు పరీక్షారుసుములను మనియార్డరు రసీదునతో తమ దరఖాస్తులను వారికే పంపుకొనవలయును.

ఆయుర్వేదాచార్యపరీక్షకు రు 7-0-0 లు, ఆయుర్వేదవిశారదపరీక్షకు రు 5-0-0, భిషక్పరీక్షకు రు 8-0-0 లు రుసుము పంపవలెను.

ఆయుర్వేదభూషణ,
కోటి రామశాస్త్రి,
కేంద్రవ్యవస్థాపకుడు.

## హిందీ ప్రచారము-ఉండి

జనవరి 19 వ తేదీ ఆదివారము మధ్యాహ్నము 2 గంటలకు, మా గ్రామమున నిరాడంబర జీవులును, ఆదర్శప్రాయులును, సీతానగర ఆశ్రమమందు హిందీప్రచారకులుగా నున్న శ్రీయుత పీసపాటి వెంకట సుబ్బారావుగారి అగ్రాసనాధిపత్యమున గత అక్టోబరు నెలలో జరుపబడిన, హిందీపరీక్షలలో కృతార్థులైన విద్యార్థినీ విద్యార్థులకు హిందీ ప్రమాణపత్ర వితరణ సభ జరుపబడెను

ఆనాడు ఉదయము 11-30 గంటలకు అగ్రాసనాధిపతిగారికి స్వాగత మొసగుటకై, ఉండీ పురప్రముఖులును, హైస్కూలు ఉపాధ్యాయులును, హిందీపాఠశాలలధ్యాపకులు తమ శిష్యబృందముతోను, పరోపకారులును, స్కౌటు మాస్టరుగారును యగు శ్రీ జోస్యుల సత్యనారాయణ మూర్తిగారు తమ బాలభట సంఘముతోను స్టేషనుకు వెళ్లి అగ్రాసనాధిపతిగారిని సాదరముగ తోడ్కొని వచ్చిరి

మధ్యాహ్నము సరిగా 2 గంటలకు సభ ప్రారంభింపబడెను.

సభ దైవప్రార్థనతో ఆరంభమాయెను మా గ్రామస్థులచే బాలగంధర్వ బిరుదము పొందిన అయ్యగారి లక్ష్మణరావు అను 10 ఏండ్ల వయస్సుగల విద్యార్థి మనోజ్ఞమగు మధుర కంఠముతో ప్రార్థనల గీతముల పాడి సభికులను ముగ్ధులను జేసెను. తరువాత అధ్యక్షులు ప్రారంభోపన్యాసము గావించిరి. పూజ్యులగు అధ్యక్షులను, హిందీ అధ్యాపకులగు శ్రీ కస్తూరి శంకరాచార్యులు గారిని ప్రశంసించుచు, హైస్కూలు ఉపాధ్యాయులగు శ్రీ కలవగుంట శేషాచార్యులుగారును బాలకవియగు శ్రీ దివాకర్ల వెంకటావధానులుగారును వారు వారు రచించిన పద్యముల జదివిరి

స్థానికోన్నత పాఠశాలోపాధ్యాయులగు శ్రీ జోస్యుల శ్రీరామమూర్తిగారు ప్రస్తుత ఉండీపుర ప్రాంతమందలి హిందీ ప్రచారమును గూర్చియు, దాని ప్రాముఖ్యమును గూర్చియు సరళమైన హిందీభాషయందు గంభీరమగు ఉపన్యాస మిచ్చిరి తరువాత శ్రీ వస్మేటి శేషగిరిరావుగారు హిందీభాషయందును శ్రీ అయ్యగారి సత్యనారాయణ మూర్తి గారు, కూనపరాజు పెదరామరాజుగారు, వాడ్రేవు కృష్ణమూర్తి గారును హిందీ భాషావశ్యకతను గురించియు, భాషాస్వరూపమును గురించియు ప్రచార విధానమును గురించియు ఆంధ్రమున ఉపన్యసించిరి.

హిందీ ప్రేమమండలి స్థాపింపబడెను దానికి ఉండీ యూనియన్ బోర్డు అధ్యక్షులగు శ్రీ ముదునూరి వెంకట నరసింహరాజుగారిని అధ్యక్షులుగను, పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగారగు శ్రీ చెన్నంసెట్టి జగపతిరావునాయుడుగారిని ఉపాధ్యక్షులుగాను, గత అక్టోబరు నెలలో జరుపబడిన రాష్ట్రభాషా పరీక్షయందు ప్రథమశ్రేణియందుత్తీర్ణులై నట్టియు, యువకులును, ఉత్సాహపూరితులును, కార్యదీక్షాపరులును నగు శ్రీ జోస్యుల శ్రీరామమూర్తిగారిని కార్యదర్శిగాను, లోకల్ కో ఆపరేటివ్ యూనియనుకు అధ్యక్షులగు శ్రీ వడింపల్లి వెంకట సుబ్బారాయుడుగారిని ప్రధాన పోషకులుగను తదితర గౌరవ సభ్యులను ఎన్నుకొనబడిరి

పిమ్మట అధ్యక్షులు గత అక్టోబరు నెలలో జరుపబడిన ప్రాథమిక ప్రవేశ, మధ్యమ, రాష్ట్రభాషలలో నుత్తీర్ణులైన 88 గురు విద్యార్థులకు ప్రమాణపత్రముల నొసంగిరి

కడపట 14 ఏండ్లలోపు వయస్సుగల హైస్కూలు విద్యార్థులచే "వేణీసంహార"మను హిందీ నాటకమునుండి ఒక రంగము ప్రదర్శింపబడెను

హిందీ భాషతోపాటు బెంగాలి ఉర్దూభాషలలో ప్రవీణులును కేవలము పారమార్థిక చింతతో ధనాపేక్షలేక నిరంతరము భాషాసేవ చేయుచున్న శ్రీ కస్తూరి శంకరాచార్యులుగారి కుమారుడు 50 లు విలువగల హిందీశబ్దసాగర మను హిందీ నిఘంటువును రాష్ట్రభాషాపరీక్షయందు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన శ్రీ జోస్యుల శ్రీరామమూర్తి గారికి ఇంగ్లీషు హిందీ నిఘంటువును హిందీ శబ్దపారితోషికమును, ఆంధ్రదేశమంతటికి ప్రాథమిక పరీక్షలో అగ్రస్థానమువహించిన శ్రీ వీరేశ్వరపు సుబ్బారావుగారికి తులసీరామాయణము అయోధ్యాకాండమును, గ్రామవాసులచే బాలగంధర్వయను బిరుదము పొందిన చి అయ్యగారి లక్ష్మణరావు అను బాలునకు ను హిందీ నాటకములో పాల్గొని చాకచక్యముగా ప్రదర్శించిన బాలురకు చి అయ్యగారి రామచంద్రరావు, రుద్రరాజు అప్పలరాజు, ముదుగంటి సుబ్బారావులు ఒక్కొక్క పిగంద్రిజయము ఇచ్చుటను ఆమోదింపబడెను

ఆహ్వానసభ్యులలో నొకరును స్థానికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీ ఎరబల్ల సుబ్బరామయ్యగారు హిందీ భాషను ప్రశంసించుచు యీ సభను జయప్రదముగ సమాప్తిచేసినందులకు అధ్యక్షులకు కృతజ్ఞతాపూర్వక వందనములతోను అతిచురుకుగా తమ విధ్యుక్తధర్మము నెరవేర్చిన బాలభట సంఘమును ఆశీర్వదించుచు సభికులకు తమ కృతజ్ఞతను చూపుచు ఉపన్యసించిరి అంతట సభ ముగిసెను

ఒక హిందీభాషాభిమాని.

## శ్రీ యువతీ నాటకసభ-బరంపురం

ఈ గ్రామమున శ్రీ సీతారామవిలాస్ సినిమాహాలులో "శ్రీ యువతీ నాటకసభవారు" శ్రీకృష్ణ తులాభారమను నాటకరాజమును గతశనివారం 25-1 30 తేదీన ప్రదర్శించినారు. యీసమాజము నూతనముగా యేర్పడినది యిందు స్త్రీలు స్త్రీ పురుషపాత్రలను, పురుషులు పురుషపాత్రలను వేసియున్నారు. నాటకము సుమారు గం 9-30 కు ప్రారంభమయ్యెను అప్పటికే హాలంతయు ప్రజలు క్రిక్కిరిసి నిండియుండిరి పైన పేర్కొనబడినసభవారు ప్రజాసమర్థమును చూచి వెంటనే టిక్కట్లు నమ్ముట మానివేసిరి యిందు మిస్ యం ఎస్ రాజేశం అను స్త్రీ సత్యభామపాత్రను ధరించెను నాటిరంగస్థలమున యీమె యొక్క హావభావములను గాంచి, నిజముగ సత్యభామయే నాడురంగస్థలము నలంకరించెనేమోయని చూపరులకనుమానము కలిగించెను యీమె విచార, క్రోధ, శృంగారరసములను అతి నిపుణతతో గన్పరచెను యిక నారదపాత్రధారులైన శ్రీయుత ఆర్ వి రమణ్ గారు కొంతవరకు తమపాత్రను సమర్థతబరచిరి శ్రీకృష్ణ వేషధారి యగు ఎస్ వి రత్నం కృష్ణుని పాత్రధరించెనేగాని, యంత దర్పము గ్రహించి యుండలేదు కారణ మేమన యీమె పద్యములుగాని, పాటలుగాని, చదువునప్పుడు అభినయముగాని రసములుగాని గనబరచినప్పుడు వీనోద్ధరసము లగు పాత్రలకు సరిపోల్చబడును గాని కృష్ణుని పాత్రకు సరిపోల్చబడి యుండలేదు వసంతకుని వేషము దాల్చిన శ్రీయుత కే యస్ రావుగారు కొంతవరకు అతిజాగరూకతతోను తమపాత్రనుపోషించికొని చూపరుల కెంతయు సంతస మొందించిరిగాని, ఒక్కొక్క సందర్భములయందు వీరి అభినయము చాలా అధికముగనుండుటచే చూపరులకు విసుగు జనించెను యీ నూతనముగా స్థాపించిన సభవారికి రాజశ్రీ అంగుసూరు లక్ష్మీనరసింహముగా రుపాధ్యాయులుగా నుండి స్వయముగా వారే హార్మోనియమును గరించి ఆదినుండి అంతము వరకు, వేషధారు లందరికి అతిఉత్సాహము గల్పించిరి కావున ప్రప్రథమమున వీరింతవ్వరయు ప్రశంసనలు జెంది నాటకము వింత జయప్రదముగా జరిగించినందులకు వీరి బుద్ధికుశలతలకు వేనోళ్ల పొగడదగియున్నది యీ నాటకమునకు ముఖ్యముగా బరంపురం సబ్ కలెక్టర్ గారైన యం యన్ పంచాపకేశయ్యర్ ఎమ్ ఎ బి సి యస్ గారు విచ్చేసి, నాదకుడలంతయుండియుండి తుదకు వారికి ద్రోవిసరితిగా సమాజము పేరిట ఉపన్యసించిరి ధారాకోటరాజాగారు, యువరాజాగారు, మొహిరీరాజాగారు యువరాజాగారున్ను యింకా అనేక ప్రముఖులున్నూ విచ్చేసిరి ఈ నాటకసభవారింతటలో తృప్తిచెందక, సత్యభామవలెనే యువతీమణుల మరికొందరిని చేర్చి తగశిక్షణనొసంగించిన, కొలది కాలములో నాటకరాజములకు ఎన్నతగిన దని మాదృఢమైన నమ్మకము యీసభవారికి భగవంతు డాయురారోగ్యైశ్వర్యముల నొసంగ ప్రార్థించుచున్నాను

డాక్టరు కె. సత్యనారాయణ.

## రైలు యిబ్బందులు

జనవరి 27 తేదీని కాకినాడలో సాయంత్రము 7 ఘంటలకు 9 down అనే సాంకేతికముచే పిలువబడే రైలుబండి బెజవాడ రైల్వేస్టేషనులో 3 వ తరగతి పెట్టెలును, వానిలోని మరుగు దొడ్లను శుభ్రము చేయబడకుండా బయలుదేరినది 1, 2, ఇంటరు తరగతుల పెట్టెలమట్టుకు బాగుచేసినారు. బండి కదలువరకూ బాగుచేస్తారేమో అని చూచినాను. బండి కదలినతరువాత గొల్లపూడి స్టేషను పరివార్డులలో అర్జి చేసి, గార్డుతో "బండి నడపుటకు తగిన స్థితిలో లేదు బండిని వెనుకకు స్టేషనులోనికి నడిపి పరిశుభ్రపరచి నడిపింపుడు" అని చెప్పినాను తరువాత స్టేషనులలో తుడిపించెదనని గార్డు ప్రతిమాలుకొనగా ప్రయాణికుల మందరమును అంగీకరించి వదులుచేసితిమి. 2 చిన్న గదులలో తప్ప మిగిలిన పెట్టెలలో మరుగుదొడ్లన్నియు ఉపయోగించుట కెంతమాత్రము వీలులేకుండా యున్నవి ఇట్టి స్థితిని పెట్టెలోనివారికి చాలామందికి చూపించినాను దీనినిబట్టిచూస్తే 25 వ తేది ఆంధ్రపత్రికలో ప్రకటింపబడిన ఆంధ్రదేశ ప్రయాణికుల సంఘమువారి తీర్మానములకు కం పెనీ అధికారులిచ్చిన జవాబులలో యీ పరిశుభ్రతకు సంబంధించిన జవాబునందు సత్యమేమియు కనపించదు. మనము సామ్ము యిచ్చినందుకుగాను యిట్టి బండ్లు నిలబెట్టి దానికి తగిన సౌకర్యములు చేయించుకొనుట ఒకటేమార్గమై కనుపించుచున్నది ప్రజలందరును ఐకమత్యముతో, జానేవ వంగీకరించుమా నాకు సహాయపడగలందులకు కోరుచున్నాను.

సూరంపూడి శ్రీహరిరావు,
ఆనందనికేతనము.

శాంతియుతమును నయిన పద్ధతులు యొక్క వారింతను యధికమును పట్టుదల వహించవలసి యుండును "

## నిరాశ జెందియుంటిమి

శాసనసభలో నుపన్యసించుచు, రాజగోపాలాచార్యులు గారిట్లు నుడివిరి —"స్వాతంత్ర్యప్రాప్తికి భుజబల మొకటియే సాధకమని యెంచుచుండినంతవరకు, మనము నిరాశులమై యుంటిమి కాని, నేడు న్యాయాయుధమగు సత్యాగ్రహమును కనిపెట్టియున్నాము ఈ యాయుధమును వాడుటయు వనిన, కొన్ని వరతులను పాటింపవలసియున్నది ఈ వరతులను మనము చక్కగా యవగాహన మొనరించుకొనని యెడల, నీ యాయుధము నిరుపయోగమగును

## 'నమ్మకములేనివారు బయటకు వెళ్లుదు

"సత్యమతలోను, అహింసాపద్ధతులలోను నమ్మకము లేనివారలీ యుద్యమమునుండి తొలగి, పైనుండియే సంగతుల నారయుచుందురుగాక! విశ్వాసము, క్రమశిక్షణ, శాంతము, నైతికశక్తి—వీనిని గలవారలే మనకు వెంటనే కావలసియున్నారు"

## గాంధీ విజయము

"బాంబు తీర్మానముపైనను, వైస్రాయిగారిని పొగడు తీర్మానముపైనను అనుకూల, ప్రతిపక్షముల బలము రమారమి సమానముగ నుండెను దీనివలన తేలినదేమి? బ్రిటీషు ప్రభుత్వ విధానమువలన ప్రజలకుగల యసంతుష్టి హెచ్చుచున్నదనియే కాని యీ తీర్మానములపై జరిగిన వోటింగువలన గాంధీగారి నాయకత్వముయొక్క బలము తగ్గినదని తలచుట పొరబాటు కాంగ్రెసు కార్యక్రమము చర్చకు వచ్చినపుడు గాంధీగారి నాయకత్వము యవిచ్ఛిన్నముగా వెలిగెను.

## నాటి మిత్రులే!

కలకత్తా కాంగ్రెసులో 1920 సం॥మున అసహాయోద్యమ కార్యక్రమమును ప్రతిఘటించిన నాయకులే యనేకులు నేడు 1930 సంవత్సరములోను లాహోరులో నా కార్యక్రమమునే ప్రతిఘటించియుండిరి కాని జాతీయమహాసభా బహిరంగ సమావేశములో నీ తీర్మానమునకు వ్యతిరేకముగా బహు కొద్దిమందే వోటు చేసియుండిరి ప్రతిపక్షులు వీర సహితమును వోటింగ నపేక్షించియే యుండలేదు బాంబు సంభవమునకు, రాజప్రతినిధి ప్రశంసకు సంబంధించిన భాగముల విషయమునకే సట్టివోటింగు కోరబడియుండెను ఆవోటింగు యొక్క ఫలితమును జూచి యెవరును దురభిప్రాయముల కొందకుందురు గాక

## ఆంగ్లేయుల సూక్ష్మబుద్ధి

ఈ యుద్యమమునకు నాయకుడెవరు, మన దేశ మాలోచించుచున్నది—అని బ్రిటీషువారు పరీక్షించుచునే యుందురు.

## నాటి స్వాతంత్ర్య తీర్మానము

చెన్నపురిలో స్వాతంత్ర్య తీర్మానము గావింపబడినపుడిట్టి యాలోచనయు కలిగియుండలేదు కాని నేడు గాంధీ మహాత్ముని, యాతని యనుచరులను వెంటనే నిర్బంధింప వలయునని బ్రిటిషు ప్రజలు కోరుచున్నారు తర్కవితర్కములతో కాలమును గడుపుచు, మీరు నిద్రపోయెదరా? లేక, మీ వాయిదవేయుచు నిలచెదరా? త్వరలో ప్రథమ పరీక్ష రానున్నది. ఇంటిలో కూర్చున్నవాడు సమరరంగమును విడనాడినవాడగును. గాంధీగారి యధికారమును, నాయకత్వమును బలపరచుట మనకు పౌరుషధర్మమయి యున్నది".

## స్వరాజ్యము బీదవారల కొరకే

విద్యార్థుల పిచ్చికేక గాదు, స్వరాజ్యము దక్షిణాఫ్రికాయందలి రయితులును, గనుల పనివాండ్రును దీనియందలి సత్యమును గ్రహించిరి, స్వపరిపాలనకొరకై యఖండత్యాగముల నొనరించియుండిరి విదేశమార్కెట్టులలో చవుకగా తమ వస్తువుల విక్రయింపజాలు ఆంగ్లేయులును, జర్మనీవారును స్వార్థమే వారి ధర్మము స్వపరిపాలనకొరకై యఖండ త్యాగముల నొనరించిరి కాన, స్వార్థమునకు స్వరాజ్యము వ్యతిరిక్తమని దలపబోకుడు చివరకు ఈ త్యాగములవలన, స్వరాజ్యసంపాదనవలన దేశమునకు లాభమే చేకూరగలదు "

## కౌన్సిలు వృత్తాంతము

శాసనసభలగూర్చి ప్రసంగించుచు, శ్రీ రాజగోపాలాచార్యులుగా రిట్లనుడివిరి. "ఒక కాగితముమీద, చక్కెర, జిగురు కలిపి రాసినచో, తెల్లవానికి హిందూస్థానమందలి తన బంగళాలో చికాకును కలిగించెడి యీగలన్నియు దానిపై వ్రాలును ఒకసారి యా కాగితముపై వ్రాలినపిదప నవి తప్పించుకొనజాలవు. శాసనసభలలోని మన ప్రతినిధుల చిత్తవృత్తియు నిట్టిదే మెల్లమెల్లగా వారిని మనము బయటకు గొనిరావలసియున్నది.

## కాంగ్రెసౌకవ్వడు పనికివచ్చెను

ఎన్నికలలో, వారు కాంగ్రెసు ప్రతిష్ఠను యుపయోగించుకొని యుండిరి కాని, నేడా కాంగ్రెసే వారల నా శాసనసభల వీడి బయటకు రమ్మనగా, వారటునుంచి యిటు తిరిగి — మా నియోజకవర్గముల వారు తమ ప్రతినిధులు శాసనసభలలో నుండితీరవలయు ననుచున్నారని వాదించుచున్నారు కావున యభిప్రాయములను గురించి తప్పుడు ఓల నడువడులను పూర్తిగా ఖండించవలసియున్నది '

# శాసనసభా ప్రశ్నోత్తరములు

(27-1-30 తేది సమావేశము)

## తిరువళిక్కేణిలో కల్లుదుకాణము

ఎస్. సత్యమూర్తిగారు

ప్రశ్న.— తిరువళిక్కేణి వెంకటరంగం పిళ్లెవీధిలో నున్న కల్లుదుకాణము తీసివేయబడవలెనని సభవారు గావించిన తీర్మానముపై ఆరోగ్యశాఖామంత్రిగారు కేమి చర్య దీసికొనదలచియున్నారు?

జవాబు — ఈ విషయముగూర్చి యేమిచర్య దీసికోబడవలెనో ఎక్సైజు లైసెన్సింగుబోర్డుతో ఆలోచింపవలసినదిగా కమిషనరుగారు కోరబడియున్నారు

## భారతదేశములో మెడికల్ కమిషనరు నియామకము

ఎస్. సత్యమూర్తిగారు

ప్రశ్న — బ్రిటిషు దేశపు జనరలు మెడికలు కౌన్సిలుపక్షమున నొక మెడికలు కమిషనరును భారతదేశములో నియమించుటకు ఆరోగ్యశాఖ మంత్రిగారు ఒప్పుకొనుటకు ముందుగా మద్రాసు విశ్వవిద్యాలయముయొక్క సలహా తీసికొనకపోవుటకు కారణమేమి?

(బి) ఈ విషయమునుగూర్చి మంత్రిగారు విశ్వవిద్యాలయముయొక్క సలహా తీసికొనదలచియున్నారా? లేనిచో, ఎందుచేత?

జవాబు — (ఏ) భారతదేశమందలి వివిధవైద్యకళాశాలలలో విద్యాబోధన యేర్పాటులగూర్చి రిపోర్టు గావించుటకుగాని జనరలు మెడికలు కౌన్సిలుపక్షమున సర్ నార్మను వాకరుగారు భారతదేశమును దర్శించు సందర్భమున 1926 సం॥లో మద్రాసు విశ్వవిద్యాలయముయొక్క సలహా తీసికొనబడెను విశ్వవిద్యాలయము సదరు సూచనను అంగీకరించెను అట్టివని శాశ్వతముగా నొక మెడికలు కమిషనరును నియమించుటకు సూచనగావింపబడెను కాబట్టి విశ్వవిద్యాలయముయొక్క సలహా మరియొకసారి దీసికొనవలసిన యవసరము లేకుండెను

(బి) మెడికలుకమిషనరు యింకను నియమింపబడకపోవుటచేత, విశ్వవిద్యాలయ డిగ్రీలను జనరలు మెడికలుకౌన్సిలుచే రికగ్నైజు చేయించుటకు అవసరమగు ప్రయత్నములనుగూర్చి మద్రాసు విశ్వవిద్యాలయముయొక్క సలహా దీసికొబడినది

## సుఖవ్యాధుల ప్రవీణునిచే నిర్వహింపబడినపని

కె వి. ఆర్ స్వామిగారు

ప్ర —(ఏ) సుఖవ్యాధుల ప్రవీణునిచే యింతవరకు నిర్వహింపబడిన పని యెట్టిది?

(బి) సుఖవ్యాధులను నిర్మూలించు విధానమేదైనను అతనిచే తయారు కాబడినదా?

జ—(ఏ) 28-12-28 తేదిన సుఖవ్యాధుల ప్రవీణుడు నియమింపబడెను అప్పటినుండియు నతడు మద్రాసు నగరమందలి పెద్ద ఆస్పత్రిలో సుఖవ్యాధుల డిపార్టుమెంటులకు సంబంధించిన పనుల యేర్పాటు చేయుచున్నాడు ఇంతవరకు గవర్నమెంటు జనరలు ఆస్పత్రిలోను, స్త్రీల ఆస్పత్రిలోను, ఈ పని యేర్పాటు చేయబడినది. మరియు, ఇతడు సుఖవ్యాధుల యొక్క నూతన చికిత్సాపద్ధతులను గవర్నమెంటు వైద్యోద్యోగులకు విస్తరికిని ప్రయివేటువైద్యులలో 12 మందికి బోధించియున్నారు

(బి) ఇటీవలనే డా॥ హోప్పరుగారు సుఖవ్యాధుల నిర్మూలనావిధానము నొకదానిని తయారుచేసి సర్జను జనరలు గారియెదుట పెట్టిరి రాజధానియందంతటను గల ఆస్పత్రులలో సుఖవ్యాధుల డిపార్టుమెంటులను తెరచుటకును ఆయా స్థలములలో ప్రచారముకొరకు సభలను జరుపుటకును డా॥హోప్పరుగారు సూచించియున్నారు. వీరి సూచనను మొత్తముమీద సర్జను జనరలుగా రంగీకరించియున్నారు. నగరేతర ప్రాంతముల ఆస్పత్రులలో సుఖవ్యాధుల డిపార్టుమెంటుల యేర్పాటు యింకను ప్రారంభింపబడలేదు. ప్రచారము విషయమున ఆరోగ్య ప్రచారక బోర్డుయొక్క సహాయముతో నొక సినిమా ఫిల్ము ప్రదర్శింపబడుచుండుటకు తయారుచేయబడుచున్నది

## గ్రామ వైద్యశాలలు

కె వి ఆర్ స్వామిగారు

ప్ర—(ఏ) గత బడ్జెట్టులో యేర్పాటు చేయబడిన ప్రకారముగా గ్రామ వైద్యశాలలు తెరువబడియున్నవా?

(బి) అట్లయినచో, ఎన్ని?

(సి) లేనిచో, ఎందుచేత?

జ —మొత్తం 78 గ్రామ వైద్యశాలల కొరకు 1928-29 బడ్జెట్టులో యేర్పాటు చేయబడెను వీనిలో 66 వైద్యశాలలు తెరువబడెను. మిగిలిన 12 వైద్యశాలలింకను తెరువబడలేదు. యోగ్యతగల వైద్యులు లభింపకపోవుటయే యిందుకు కారణము

## మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టము 52 (2) సెక్షనుక్రింద శిక్షలు

టి ఆదినారాయణ చెట్టిగారు

ప్ర —(ఏ) మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టముయొక్క 52 (2) సెక్షనుక్రింద శిక్ష లేవయినను జరిగియున్నవా?

(బి) అట్లయినచో, సదరు మునిసిపాలిటీలెవ్వి? విధింపబడిన శిక్ష యెట్టిది?

జ — ఈ సెక్షనుక్రింద యేవైన కేసులయొక్క ప్రాసిక్యూషను కూడ ప్రభుత్వమువారు సాంక్షను చేయలేదు. ఇతర మునిసిపలు యుద్యోగులనుగూర్చి ప్రభుత్వమువారికి భోగట్టా లేదు

## సి. ఐ. డి శాఖవారిపని

కె వి ఆర్ స్వామిగారు

ప్ర — (ఏ) సి ఐ డి శాఖకు గత పదేండ్లలో ప్రతి సంవత్సరము యెంతఖర్చు చేయబడెను

(బి) ఈ డిపార్టుమెంటుచే పట్టుకొబడిన నేరములెన్ని?

(సి) విచారణకు పెట్టబడిన నేరములెన్ని?

జ —(ఏ)

| | |
|---|---|
| 1919-20 | రూ 2,67,416 |
| 1920-21 | 2,51,842 |
| 1921-22 | 2,70,706 |
| 1922-23 | 2,47 031 |
| 1923-24 | 2,51,508 |
| 1924-25 | 2,59,596 |
| 1925-26 | 2 39,916 |
| 1926 27 | 2,46,438 |
| 1927-28 | [illegible] |
| 1928-29 | 2,41,962 |

(బి) (సి) ప్రభుత్వమువారికి భోగట్టా లేదు

## రాజకీయ నిర్బంధితులకు సౌకర్యములు.

ఎస్ సత్యమూర్తిగారు

ప్ర—(ఏ) రాజకీయ నిర్బంధితుల సౌకర్యము గూర్చి మద్రాసు ప్రభుత్వమువారు ఇండియా ప్రభుత్వమువారిచే ప్రశ్నింపబడియున్నారా?

(బి) అట్లయినచో, ఇండియా ప్రభుత్వమువారి జాబు మద్రాసు ప్రభుత్వమువారి కెప్పుడు చేరినది?

దానిపై మద్రాసు ప్రభుత్వమువారేమి చర్య దీసికొనిరి?

(సి) స్థానిక ప్రభుత్వమువారు ఇండియా ప్రభుత్వమువారికి ప్రత్యుత్తరము బంపుటకు ముందుగా అనధికారుల యభిప్రాయమును దెలిసికొనదలచియున్నారా?

(డి) అట్లయినచో, ఏ విధముగ సలహా దీసికొందురు.

(ఇ) ఈ సభయొక్క యభిప్రాయము తీసికొబడునా? లేనిచో ఎందుచేత?

జవాబు — (ఏ) (డి) రాజకీయ నిర్బంధితుల సౌకర్యములకు సంబంధించిన నిబంధనలను మరల పరిశీలింపవలసినదిగా స్థానిక ప్రభుత్వమువారిని ఇండియా ప్రభుత్వమువారు గోరిరి ఇండియా ప్రభుత్వమువారి నుండి మొట్టమొదటి జాబు ఆగస్టునెలాఖరునచేరెను ఆవిషయమునకే సంబంధించిన మరియొక జాబు గత అక్టోబరు ప్రారంభమున చేరెను. ప్రభుత్వమువారు కొందరు అధికారోద్యోగులయొక్కయు, అనధికారులయొక్కయు జైళ్ల విజిటర్లయొక్కయు, శాసనసభ్యులయొక్కయు, అభిప్రాయములను దెలిసికొనినపిమ్మట, ఇండియా ప్రభుత్వమువారికి కొన్ని సిఫార్సులను గావించిరి

(ఇ) ఈవిషయమునుగూర్చి శాసనసభ్యులయొక్క యభిప్రాయములు ప్రభుత్వము వారియెదుట పెట్టబడియుండెను. ఈ యభిప్రాయములు 3-9-29 తేది సమావేశములో శ్రీయుత సత్యమూర్తిగారిచే నుపపాదింపబడి చర్చింపబడిన తీర్మానముల సందర్భమున ప్రకటింపబడియుండెను

